# శ్రీ విక్రమనామ సంవత్సర

## [illegible], 2000-2001



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

శ్రీయైనమః

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరాభ్యాం నమః

శ్రీ లక్ష్మీ గణపతయే నమః

# శ్రీ విక్రమనామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

## 2000-2001

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతిగారిచే విరచితము.




తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన పణ్డితులు

అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులవారిచే పరిష్కృతము


తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

మహారాజశ్రీ డా॥ ఐ.వి సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారిచే ప్రకటింపఁబడినది.

తిరుపతి

2000

## శ్రీ వేంకటేశ భగవాన్



ఓమ్ ॥ మత్వాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసారసింధుస్తదా
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్ ।
శేషాద్రౌ జగతోఽస్య రక్షణధియాఽతిష్ఠద్దయా సాగరః
సశ్శ్రియాంసి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః ॥

కీ.శే. శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్.

# శ్రీ విక్రమనామ సంవత్సర

# సిద్ధాన్త

# పంచాఙ్గ పీఠికా




పంచాంగకర్త :

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థానసిద్ధాంతి అగు

కీ॥శే॥ దైవజ్ఞశేఖర బ్రహ్మశ్రీ తంగిరాల చినహనుమత్సిద్ధాంతిగారి కుమారుడు

**శ్రీ ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి, STD: 08819 ఫోన్: 55364

(శ్రీ పూర్ణ జ్యోతిర్నిలయం)

రేలంగి - తణుకు తాలూకా,

పశ్చిమ గోదావరిజిల్లా (ఆంధ్ర).

## శ్రీ పద్మావతీ దేవి



ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్స్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

శ్రియైనమః

శ్రీనివాసాయ నమః

శ్రీమద్వికనసమహాగురుభ్యో నమః

# శ్రీ విక్రమనామ సంవత్సర పంచాఙ్గ విషయసూచికా

గమనిక:

ఈ పంచాంగము నందలి తిథి, నక్షత్ర, యోగ, కరణముల సమయములు అంత్యమును, అమృతాది, గ్రహప్రవేశ సమయములు ప్రారంభమును, వర్జ్యములు ప్రారంభాంత్యమును తెలుపును.

* * *

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# పీఠికారంభః

ఓమ్ । శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతమ్ ।
విఘ్నం విఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥
శ్రీమాన్ శ్రీశేషపృథ్వీ ధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తసన్వంత సోతు ।
లక్ష్మీం లక్ష్మీ వియోగాసహనిజహృదయఃకోఽపి కారుణ్యపూర్ణో
దేవధీశఃప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ॥
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠ ముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥
శ్రీ విష్ణుచిత్తకుల నందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥
విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మసజ్జకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః ।
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః ।
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభ యుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ।

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥
శ్రీ వేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః దద్యుర్మనోరథం సర్వం దేవతాఃఫలముత్తమమ్॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ । చంద్రార్కౌ తత్రసాక్షిత్వం భజేతేనిశ్చలంయతః॥
యథాశిఖామయూరాణాంనాగానాంమణయోయథా । తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్॥

శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హనూమాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥
సోహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

## గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీ పిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాది పురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్త్రిస్కంధాంబుధిపారగం మమ గురుం వందే సదాశ్రేయసే ॥

## దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా ప్పనృసింహతాట కేశాదిదేవై రభిరక్ష్యమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంత శ్రీగోస్తనీతీర విరాజమానమ్ ॥
శ్రీవేదవేదాంగ విదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ।
ఈడ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహువశ్శ్రుతిస్మృతివిధౌ సజ్జ్యోతిషే పండితాః
శ్రీవత్సాభిధగోత్రజాస్త దనుమత్త్సేతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండిత సార్వభౌమ హనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణ సోమయాజీసు సిద్ధాన్తవిదగ్రగణ్యః
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ
జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వైతీయాకస్తు పూర్ణదైవజ్ఞః
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః

చత్వారస్తనూజాః హనుమత్సిద్ధాంతినః తృతీయస్తేషు
ప్రభాకరపూర్ణశర్మాహం శ్రీనివాసకరుణాకాంక్షి
అసూర్యం చ్యవనోంగిరోఽత్రి ముఖరానభ్యర్చమాన్యాన్మునీ
నాచార్యానపరాన్మయా సుమనసా శ్రీతాతపాదం గురుమ్
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సశ్శ్రేయాంసి దయామయః కలయ తాం శ్రీ వేంకటేశః ప్రభుః

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి.

## అథ బ్రహ్మణః ఆయుః ప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభికమల జాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుః వర్ష శతమేవ । తత్ప్రమాణ సౌరాబ్దాః 31104000 కోట్లయః । ద్వితీయ పరార్థే ప్రథమవాసరే గతఘటికాదయః ఘడి 17 విఘ 42 ప్రాణకాల (0) గుర్వ క్షరోచ్చారకాలః 3 నిమేషః 19లవ త్రుటయః 3 సంప్రతి చతుర్థేత్రుటౌ గతసౌర మాసాదయః 2,14,27,32 ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః సప్తమే వైవస్వత మన్వంతరే 27 మహాయుగాని గతాని. అధు 28 తమే మహాయుగే వర్తమానం కలియుగం వ్యవహ్రియతే.

"యుగంభవేత్ వత్సర పంచకేన యుగాని తు ద్వాదశ వర్షష్ట్యాం" అను ప్రమాణముచే ప్రభవాది 5 సం॥ రములు ఒక యుగము చొ॥న (5X12=60) 12 యుగములుగా నగుచున్నది. ఇట్లుగ కృష్ణయజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణము 10 ప్ర॥ పాఠకము, 4వ అనువాకము చెప్పుచున్నది.

1 2 3 4 5

సంవత్సరోఽసి, పరివత్సరోఽసి, ఇదావత్సరోఽసి, ఇదువత్సరోఽసి, ఇద్వత్సరోఽసి

॥ ఇతి ॥ ఇందులకు విద్యారణ్య భాష్యము.

ప్రభవాదిషు షష్టి సంవత్సరేషు ఏకైకస్మింశ్చక్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే ............. .................హే అగ్నేత్వం సంవత్సరోసి ప్రభవాది రూపోసి, పరివత్సరోసి -- విభవ రూపోసి, ఇదావత్సరోసి - శుక్లరూపోసి, ఇదువత్సరోసి - ప్రమోదరూపోసి, ఇద్వత్సరోసి - ప్రజాపతిరూపోసి, పంచస్వేతేషు అనుగతాకారః వత్సరః ఏతద్రూపోసి.

ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "1. సంవత్సరము, 2. పరివత్సరము, 3. ఇదావత్సరము, 4. ఇదువత్సరము, 5. ఇద్వత్సరము" అను నామములు కలవై యున్నవి. ఇటులనే ప్రతి అయిదు సంవత్సరములకు నామములు తెలియదగియున్నవి. ఇప్పుడు ఇంద్ర దేవతాకమగు తృతీయ యుగమున (వర్తమానమున పంచవత్సరాత్మకమగు తృతీయ యుగమున) 4వది అగు ప్రజాపతిదేవతాక, అనువత్సర నామముగల ఈ విక్రమనామ సం॥రమునందు ధాన్యదానము విశేష పుణ్య ఫల ప్రదము.

దయా సముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు అన్నియును శుభప్రదములుగను, సుఖప్రదములుగను ఉండునట్లు అనుగ్రహింతురుగాక.

# శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2-55 | అక్షాంశాః + 13.44

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ॥ 0-29 గం. + 0-12 విఘ

అయనాంశాః భా. 23-50.32

## స్ఫుటలగ్న ప్రమాణ, పుష్కరకాలాః

| | | | | |
|---|---|---|---|---|
| మేషస్య | 4-28 = 3-7 | | తులాయాః | 5-18 = 4-14 |
| వృషభస్య | 5-4 = 2-22 | | వృశ్చికస్య | 5-31 = 1-17 |
| మిథునస్య | 5-30 = 4-24 | | ధనుషః | 5-19 = 3-43 |
| కర్కాటకస్య | 5-28 = 1-16 | | మకరస్య | 4-44 = 2-13 |
| సింహస్య | 5-10 = 3-38 | | కుంభస్య | 4-14 = 3-23 |
| కన్యాయాః | 5-6 = 2-23 | | మీనస్య | 4-8 = 0-58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహింపవలెను. తిరుపతి ప్రాంతంలోని అలవాటులో ఉన్న పాతలగ్న ప్రమాణములు ప్రాచీనకాలములో సాధించబడినందున పరిగ్రాహ్యములు గావు.

### తిరుపతి నుండి రాజమండ్రికి దేశాంతరకాలము

| సాయనమాసము | మేష | వృషభ | మిథున | కర్కాటక | సింహం | కన్యా |
|---|---|---|---|---|---|---|
| | + ౩౨ | + ౩౯ | + ౪౫ | + ౪౮ | + ౪౫ | + ౩౯ |
| | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
| | + ౩౨ | + ౨౪ | + ౧౬ | + ౧౯ | + ౧౬ | + ౨౪ |

పై సంస్కార విఘడియలను తిథ్యాధికమునందు మేషాది సాయన మాసారంభ దినమున సంస్కరింపగా రాజమండ్రికి సూర్యోదయాది కాలమగును. మాసాది నుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్యదినము లందు సంస్కరింపవలెను.

పరమ దినప్రమాణం 32-3, పరమ క్షయదిన ప్రమాణం 27-57

# తిరుపతి (వేంకటాద్రి) ప్రాంతమందు సూర్యోదయాస్తమయ కాలములు

| 2000 సం॥ | తేది | సూ. ఉ. గం.-ని. | సూ. అ గం.-ని. | 2000-2001 సం॥ | తేది | సూ. ఉ. గం.-ని. | సూ. అ గం.-ని. |
|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 2000 | 5 | 6-10 | 6-20 | అక్టోబరు 2000 | 5 | 6-06 | 5-58 |
| | 10 | 6-06 | 6-21 | | 10 | 6-06 | 5-52 |
| | 15 | 6-03 | 6-22 | | 15 | 6-08 | 5-52 |
| | 20 | 6-00 | 6-22 | | 20 | 6-08 | 5-48 |
| | 25 | 5-58 | 6-23 | | 25 | 6-08 | 5-46 |
| | 30 | 5-55 | 6-24 | | 30 | 6-10 | 5-44 |
| మే | 1 | 5-55 | 6-24 | నవంబరు | 1 | 6-11 | 5-43 |
| | 5 | 5-53 | 6-25 | | 5 | 6-12 | 5-41 |
| | 10 | 5-52 | 6-26 | | 10 | 6-14 | 5-40 |
| | 15 | 5-50 | 6-28 | | 15 | 6-16 | 5-39 |
| | 20 | 5-49 | 6-29 | | 20 | 6-17 | 5-39 |
| | 25 | 5-48 | 6-31 | | 25 | 6-20 | 5-39 |
| | 30 | 5-48 | 6-32 | | 30 | 6-23 | 5-40 |
| జూన్ | 1 | 5-48 | 6-33 | డిశంబరు | 5 | 6-26 | 5-40 |
| | 5 | 5-48 | 6-34 | | 10 | 6-28 | 5-42 |
| | 10 | 5-48 | 6-36 | | 15 | 6-32 | 5-44 |
| | 15 | 5-49 | 6-37 | | 20 | 6-34 | 5-46 |
| | 20 | 5-50 | 6-38 | | 25 | 6-37 | 5-48 |
| | 25 | 5-51 | 6-39 | | 30 | 6-40 | 5-52 |
| | 30 | 5-52 | 6-40 | జనవరి 2001 | 1 | 6-41 | 5-52 |
| జూలై | 1 | 5-52 | 6-40 | | 5 | 6-42 | 5-56 |
| | 5 | 5-53 | 6-40 | | 10 | 6-44 | 5-58 |
| | 10 | 5-54 | 6-41 | | 15 | 6-44 | 6-01 |
| | 15 | 5-56 | 6-41 | | 20 | 6-45 | 6-04 |
| | 20 | 5-57 | 6-40 | | 25 | 6-46 | 6-06 |
| | 25 | 5-58 | 6-39 | | 30 | 6-44 | 6-08 |
| | 30 | 6-00 | 6-38 | ఫిబ్రవరి | 1 | 6-45 | 6-9 |
| ఆగస్టు | 1 | 6-00 | 6-38 | | 5 | 6-44 | 6-11 |
| | 5 | 6-01 | 6-36 | | 10 | 6-42 | 6-13 |
| | 10 | 6-02 | 6-34 | | 15 | 6-40 | 6-14 |
| | 15 | 6-02 | 6-32 | | 20 | 6-38 | 6-15 |
| | 20 | 6-03 | 6-29 | | 25 | 6-36 | 6-16 |
| | 25 | 6-04 | 6-26 | | 28 | 6-34 | 6-17 |
| | 30 | 6-04 | 6-24 | మార్చి | 1 | 6-33 | 6-17 |
| సెప్టెంబరు | 1 | 6-04 | 6-22 | | 5 | 6-31 | 6-18 |
| | 5 | 6-04 | 6-19 | | 10 | 6-28 | 6-18 |
| | 10 | 6-05 | 6-16 | | 15 | 6-24 | 6-19 |
| | 15 | 6-05 | 6-12 | | 20 | 6-22 | 6-20 |
| | 20 | 6-05 | 6-09 | | 25 | 6-18 | 6-20 |
| | 25 | 6-05 | 6-05 | | 30 | 6-15 | 6-20 |
| | 30 | 6-06 | 6-01 | ఏప్రిల్ | 1 | 6-13 | 6-20 |
| అక్టోబరు | 1 | 6-06 | 6-00 | | 5 | 6-10 | 6-21 |

శ్రీ మహాగణాధిపతయేనమః

# నిత్యధ్యాన శ్లోకములు

## శ్రీ గణేశ స్తోత్రం

శ్లో॥ శ్రీమద్గణేశం విధిముఖ్యవంద్యం గౌరీసుతం విఘ్నతమోదినేశం ।
కళ్యాణ సంవర్ధిత భక్తలోకం సర్వార్థ సిద్ధ్యర్థమహం భజామి ॥

## శ్రీ సరస్వతీ స్తోత్రం

శ్లో॥ సరస్వతీ త్వియందృష్ట్వా । వీణాపుస్తకధారిణీ ।
హంసవాహన సంయుక్తా । విద్యాదానకరీమమ ॥

## శ్రీ వేంకటేశ్వర స్తోత్రం

శ్లో॥ శ్రియఃకాన్తాయ కళ్యాణ । నిధయే నిధయేఽర్థినాం ।
శ్రీ వేంకట నివాసాయ । శ్రీనివాసాయ మంగళం ॥

## శ్రీ భూదేవి స్తోత్రం

శ్లో॥ విష్ణుశక్తి సముత్పన్నే । శంఖవర్ణ మహీతలే ।
అనేక రత్న సంభూతే । భూమిదేవి నమోస్తుతే ॥

## శ్రీ గురు ప్రార్థన

శ్లో॥ నిత్యానందైక కందాయ । నిర్మలాయచిదాత్మనే ।
జ్ఞానోత్తమాయ గురవే । సాక్షిణే బ్రహ్మణేనమః ॥

## పరమ భాగవతోత్తములు

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక ।
భీష్మ దాల్భ్యాన్, రుక్మాంగదార్జున
వశిష్ఠ విభీషణాదీన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥

## వ్యాసప్రార్థన

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా । ద్విబాహురపరోహరిః ।
అఫాలలోచన శ్శంభు । ర్భగవాన్ బాదరాయణః ॥

## నవగ్రహ ప్రార్థన

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ । మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ । రాహవే కేతవేనమః ॥

## గోమాత ప్రార్థన

శ్లో॥ గావో మేమాతరస్సర్వా । గావోమే పితరస్సదా ।
గావో మమాగ్రతస్సంతు । గావోమే సంతుస్పృష్టతః ।
గావోమే పార్శ్వతస్సంతు । గవాంబృందేవసామ్యహం ॥

## బిల్వవృక్ష ప్రార్థన (మారేడు)

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం । త్రినేత్రంచ త్రియాయుషం ।
త్రిజన్మ పాపసంహారం । ఏకబిల్వం శివార్పణం ॥

## అశ్వత్థ ప్రార్థన (రావిచెట్టు)

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ । మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రత శ్శివరూపాయ । వృక్షరాజాయతేనమః ॥

## సంధ్యా దీప ప్రార్థన

శ్లో॥ శుభం భవతు కల్యాణీ । ఆరోగ్యం ధనసంపదం ।
మమశత్రు వినాశాయ । సాయం జ్యోతిర్నమోస్తుతే ॥

## వాల్మీకి ప్రార్థన

శ్లో॥ కూజన్తం రామ రామేతి । మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితా శాఖాం । వన్దే వాల్మీకి కోకిలం ॥

## ఔషధ సేవ

శ్లో॥ ధన్వంతరిం గరుత్మంతం । ఫణిరాజంచ కౌస్తుభం ।
అచ్యుతం చామృతం చంద్రం । స్మరేదౌషధకర్మణే ॥

## చంద్ర దర్శనం (నెలపొడుపు)

శ్లో॥ క్షీరసాగర సంపన్న । లక్ష్మీప్రియ సహోదర ।
హిరణ్య మకుటావ్ భాస్వత్ । బాలచంద్ర నమోస్తుతే ॥

## పరాశర ప్రార్థన

శ్లో॥ ధర్మజ్ఞం ధార్మికం ధీరం । ధర్మాత్మానం దయానిధిం ।
ధర్మశాస్త్ర ప్రవక్తారం । పరాశరమునింభజే ॥

## తులసీ ప్రార్థన

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని । యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ । తులసీంత్వాం నమామ్యహమ్ ॥

సూర్యస్తవం

శ్లో॥ ఉదయే బ్రహ్మరూపశ్చ । మధ్యాహ్నేతు మహేశ్వరః ।
అస్తకాలే స్వయం విష్ణుః । త్రిమూర్తిశ్చ దివాకరః ॥

ప్రదక్షిణ నమస్కారం

శ్లో॥ అన్యధా శరణం నాస్తి । త్వమేవ శరణం మమ ।
తస్మాత్ కారుణ్య భావేన । రక్షరక్ష జనార్ధన ॥
రక్షరక్ష పరమేశ్వర
రక్షరక్ష గణాధిప
రక్షరక్ష మహేశ్వరి

నిద్రలేచునపుడు (భూ ప్రార్థన)

శ్లో॥ సముద్ర వసనే దేవీ । పర్వతస్తన మండితే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం । పాదస్పర్శం క్షమస్వమే ॥

కర దర్శనం

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మిః । కరమధ్యే సరస్వతీ ।
కరమూలే స్థితా గౌరీ । ప్రభాతే కరదర్శనం ॥

భుజించునపుడు

శ్లో॥ అన్నం బ్రహ్మరసో విష్ణుర్భోక్తా దేవో మహేశ్వరః ।
ఏవం సంచిత్య భుంజానో దృష్టిదోషైర్నలిప్యతే ॥

భుజించిన పిదప

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ । శమ్యంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం । స్మరామిచ వృకోదరం ॥

శ్రీ విఖనసాచార్య స్తోత్రం

శ్లో॥ శ్రౌతస్మార్తాదికం కర్మ । నిఖిలం యేన సూత్రితం
తస్మై సమస్త వేదార్థవిదే । విఖనసే నమః ॥

* * *

శ్లో॥ శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదాన తుల్యంనృణాం ।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం
నా నా కర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం ॥

| | | | |
|---|---|---|---|
| కలియుగాబ్దములు | 5101 | శ్రీ శంకరాచార్యాబ్దములు | 2072 |
| విక్రమార్క శకాబ్దములు | 2057 | శాలివాహన శకాబ్దములు | 1922 |
| హిజరీ శకాబ్దములు | 1420-21 | శ్రీరామానుజాబ్దములు | 983 |
| శ్రీమధ్వాచార్యాబ్దములు | 883 | భారత స్వతంత్రాబ్దములు | 53 |
| ఆంధ్రరాష్ట్రావతారణాబ్దములు | 44 | ఇంగ్లీషు | 2000-2001 |

## నవనాయక నిర్ణయము

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజా | -- | బుధః | అర్ఘాధిపతిః | -- | గురుః |
| మంత్రీ | -- | గురుః | మేఘాధిపతిః | -- | గురుః |
| సైన్యాధిపతిః | -- | గురుః | రసాధిపతిః | -- | కుజః |
| సస్యాధిపతిః | -- | రవిః | నీరసాధిపతిః | -- | రవిః |
| ధాన్యాధిపతిః | -- | శుక్రః | | | |

శుభులు 6 + పాపులు 3 = మొత్తం 9.

## పురోహితాది ఉపనాయక నిర్ణయము

పురోహిత, గణక, పరీక్షకాది ఉపనాయక గ్రహములు శుభులు శుభఫలితములను, పాపులు పాపఫలితములనిచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురోహితః | -- | రవిః | నరాధిపతిః | -- | గురుః |
| పరీక్షకః | -- | రవిః | గ్రామాధీశః | -- | రవిః |
| గణకః | -- | చంద్రః | వస్త్రాధీశః | -- | కుజః |
| గ్రామనాయకః | -- | గురుః | రత్నాధీశః | -- | రవిః |
| దైవజ్ఞః | -- | బుధః | వృక్షాధిపతిః | -- | శుక్రః |
| రాష్ట్రాధిపతిః | -- | బుధః | జంగమాధిపతిః | -- | రవిః |
| సర్వదేశోద్యోగాధిపతిః | -- | గురుః | సర్పాధిపతిః | -- | చంద్రః |
| అశ్వాధిపతిః | -- | గురుః | మృగాధిపతిః | -- | బుధః |
| గజాధిపతిః | -- | రవిః | శుభాధిపతిః | -- | బుధః |
| పశూనామాధిపతిః | -- | గురుః | స్త్రీణామధిపతిః | -- | శుక్రః |
| దేవాధిపతిః | -- | రవిః | | | |

శుభులు 13 + పాపులు 8 = మొత్తం 21.

* * *

# శ్రీ విక్రమనామ సంవత్సర పీఠికారంభః

## సంవత్సర ఫలితము

చాంద్రమానము వలన ఈ సంవత్సరము "విక్రమ" నామ సంవత్సరము అనియు బార్హస్పత్యమానముచే "విజయ"నామ సంవత్సరమనియు గురూదయాబ్దముచే "కార్తీకాబ్దము" అనియు వ్యవహరింపబడును.

ప్రభవాది అరువది సంవత్సరములలో పంచవత్సరాత్మకమగు 12 యుగములలో ఇంద్ర దేవతాకమగు తృతీయ యుగమున అనువత్సరనామకమగు నాల్గవదియగు ప్రజాపతి దేవతాకమను విక్రమ నామ సంవత్సరము అగుచున్నది. ఇందు ధాన్యదానం విశేష పుణ్య ఫలప్రదము.

ఈ సంవత్సరము రాజు బుధుడు. మంత్రి, సైన్య, అర్ఘాధిపతి గురుడు. సస్య, నీరసాధిపతి రవి. ధాన్య మేఘాధిపతి శుక్రుడు. రసాధిపతి కుజుడు. పశుపాలకుడు బలరాముడు. గోష్ఠాగార ప్రాపకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాద్బహిష్కర్త శ్రీకృష్ణుడు. రాత్రియందు ఆర్ద్ర ప్రవేశము సస్యాభివృద్ధి. సాయంత్రమందు రవి మేషరాశిని ప్రవేశించుటచే, గురువారము అగుటచే సస్యానుకూల వర్షములు, పాడిపంటలు అభివృద్ధి చెందును. జ్యేష్ఠమాసాంత్యమున తొలకరి వర్షములు పడును. అన్నిప్రాంతముల భూములు, అన్ని ప్రాంతముల పంటలు సమముగా పండును.

| బుశు | రకు గుశ | | |
|---|---|---|---|
| కే | జగల్లగ్నము | | చం రా |
| | | ల | |

| రచంశు | కుగుశ | | |
|---|---|---|---|
| బు / కే | వర్షలగ్నము | | రా |
| ల | | | |

వర్షలగ్నమును పరిశీలించగా, లగ్నసౌఖ్యాధిపతికి పంచమకోణస్థితి కుజ, గురు, శని గ్రహములకు పంచమ స్థితి, రాజ్యాధిపతికి శతృస్థానస్థితి, రవి, చంద్ర, శుక్ర గ్రహములకు కేంద్ర స్థితి, సంవత్సర ఉత్తరార్ధమున శని, గురు గ్రహములకు వక్రస్థితి కల్గినవి. వ్యాపార ధనకారక గ్రహములు అష్టమ స్థితి కల్గినవి.

జగల్లగ్నముమ పరిశీలించగా లగ్నాధిపతికి శతృస్థానమందు ఉచ్ఛస్థితి సప్తమ కేంద్రమందు "నీచభంగరాజయోగము" పాపగ్రహబలాధిక్యత కల్గినవి. రాజ్యాధిపతి చంద్రునికి స్వక్షేత్రమందు ఛండాలత్వము కల్గినవి. వీరిని పరిశీలించగా సస్యమునకు వర్షవాతావరణములు అనుకూలముగా ఉంటాయి. సస్యవృద్ధికై కాక అధికారులు ధనమును దుర్వినియోగము చేయుదురు. స్త్రీ పురుషులందు పరస్పర భేదాభిప్రాయములు కల్గును. స్త్రీలు న్యాయపోరాటమును చేయుదురు. సంవత్సర ఉత్తరార్ధమున రాజకీయ శతృత్వములు వాతావరణ కాలుష్యములు, ప్రాకృతిక బీభత్సములు ఉండును. రాజుగా బుధుడు

అత్యంత మెత్తని గ్రహము అగుటచే స్వల్ప ఆలోచనలు కల్గి సమర్థతయందు లోటు కన్పించును. మంత్రి మిగిలిన గ్రహములు బలవంతులు అగుటచే స్వలాభములతో యుద్ధానికి పూనుకొనుచుందురు. బంగారాది లోహములకు ధనము నిలబాటుగా ఉండును. ప్రజలందు నాస్తికవాదము ప్రబలుచుండును. రంగు వస్తువుల వ్యాపారులకు అభివృద్ధి కలుగును. కార్మికులు, వ్యవసాయదారులకు ఇబ్బందులు కల్గును.

భారతవర్షమున శుక్రమహాదశ ఉండుటవలన కీర్తిప్రతిష్ఠలు, ఆదాయములు బాగుండును. చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ మాసములందు కాలసర్పయోగము షష్ఠ గ్రహకూటమి, పంచగ్రహకూటమి, చాతుర్గ్రహకూటమి కల్గుచున్నవి. వీని ప్రభావముచే తూర్పు, ఉత్తర ప్రాంత అరిష్టములు, జలప్రమాదములు, ప్రాకృతిక భీభత్సములు, చిన్న యుద్ధములు సంవత్సరమంతయు శనిగురుల కలయికచే అత్యధిక ధన, జన, పశు వ్యయములు. తూర్పు ఈశాన్య దేశములందు, మధ్యదేశములందు విపత్తులు, విమాన ప్రమాదములు, ఉపద్రవములు సంభవించును. మొత్తము మీద స్వల్ప వర్షములు, నూనె, నెయ్యి, ఉప్పు మొదలగు వానికి అధికధరలు. సంవత్సర ఉత్తరార్ధమున ధాన్యము ధరలు అధికమగును. చైత్ర వైశాఖములందు వాతావరణము బాగుండును. ఒడిదుడుకులు కలిగి నిలబాటుగా ఉండును. జ్యేష్ఠ ఆషాఢ మాసములు గ్రహముల మార్పులచే రాజకీయ అరిష్టములు, అధిక ఎండలు, సమధరలు ఉండును. శ్రావణ, భాద్రపద మాసములందు ధరలు సమము, అధిక వర్షములు, రోగ పీడలు, వరదలు. ఆశ్వయుజ, కార్తీకములందు ప్రజాకల్లోలములు, వ్యాపార మార్గావరోధములు, ముఖ్యాధికారులకు ఒడిదుడుకులు కల్గును. తర్వాతి మాసములందు దుర్భిక్షములు, బంగారాది లోహములకు ధరలు హెచ్చుతగ్గులు ఉండును. మొత్తము మీద సంవత్సరమున మిశ్రమ ఫలితములు, అశాంతి కల్గుచుండును. ఏది ఏమైననూ గత రెండు సంవత్సరముల నుండి గురుబలం లేకున్ననూ ఈ సంవత్సరమున శనిని వీడిన గురునికి భవిష్యత్తునందు మరల ఛండాలత్వము కలుగు చున్నందున అధికారులు, ప్రజలు అన్ని రంగములందు అప్రమత్తత పాటించవలెను అనుటలో సందేహములేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములలో నాయకులకు భేదాభిప్రాయములున్నప్పటికీ, చక్కగా సమర్థవంతముగా పరిపాలన జరుగును. రాబోవు శ్రీ వృషనామ సంవత్సరమునందు ఆశ్వయుజమాసమధికమగును.

నూతన సహస్రాబ్దము విక్రమతో ప్రారంభమగుటచే లోకచక్రవర్తి శ్రీ సూర్యభగవానుడు, యుగచక్రవర్తి శ్రీ కృష్ణపరమాత్మ, కలియుగ దైవము శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరులు లోకమునకు శాంతి, సౌభాగ్యము, రక్షణ, సద్బుద్ధి కల్గింతురు గాక.

మంగళం మహత్ శుభం భూయాత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## సంవత్సరఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వని | పుష్యమి | స్వాతి | అభిజిత్‌ల | వార్కి | రాజపూజ్యత |
| భరణి | ఆశ్రేష | విశాఖ | శ్రవణం | " | యుద్ధభయము |
| కృత్తిక | మఖ | అనూరాధ | ధనిష్ఠ | " | అలంకారప్రాప్తి |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శతభిషం | " | రోగభయము |
| మృగశిర | ఉత్తర | మూల | పూ.భా. | " | ఆయుర్వృద్ధి |
| ఆర్ద్ర | హస్త | పూ.షా. | ఉ.భా. | " | అర్థలాభము |
| పునర్వసు | చిత్త | ఉ.షా | రేవతి | " | మహస్తాపము |

### చాంద్రమానాబ్ద నిర్ణయము

శ్లో॥ వర్షంతిసతతం మేఘా సృష్ట్యా మహీవృద్ధి కృత్ ।
విక్రమాబ్దే పిలక్ష్మీశాః విక్రమాక్రాంత భూమయః ॥

ఈ అబ్దాధిపతి చంద్రుడు గాన అధికారులు ప్రజాభీష్ట పరిపాలన చేయుదురు. వర్షములు బాగుగ కురియును. ప్రాకృతిక బీభత్సములుండును. ధాన్య సమృద్ధి కల్గి వుండును. భూకంపములు, స్ఫోటకాగ్ని శస్త్ర బాధలు, నగరములు నిర్మానుష్యతలు కల్గుచుండును.

### బార్హస్పత్య మానాబ్ద నిర్ణయము

శ్లో॥ స్త్రీ పుంసోర్మద వృద్ధిస్స్యా త్పాపకర్మరతాః ప్రజాః ।
రాజ్యేపరస్పరాఘాతం విజయాబ్దే జయావహమ్ ॥

ఇందు విజయనామ సంవత్సరమగుటవలన స్త్రీ పురుషులయందు డాంబికములు, మదములు అధికము, ఆహార ధాన్యములు ధరలు పెరుగును. వ్యాపారులకు సంవత్సర మధ్యయందు పీడలు కల్గును. ప్రజలు అన్యోన్యములు, కలహములు కల్గివుందురు.

### గురుదయాబ్ద నిర్ణయము

ఇందు కార్తికాబ్దమగుట వలన సామాన్య జీవనసరళికి భంగములు కల్గును. శస్త్రాగ్ని చోరబాధలు వుండును. కూరలు, ఫలపుష్ప వ్యాపారులకు వృద్ధి కల్గును. నాస్తికత్వము ప్రబలును.

### పావన వర్షారంభ ఫలము

2000 సం॥రము అక్టోబరు 13వ తేదీ ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమా శుక్రవారమగును. శుక్ర వారమగుట వలన సస్యానుకూల్య వాతావరణము, సుభిక్షము కల్గును.

### కర్తరీ నిర్ణయము

ది. 4-5-2000 చైత్ర బహుళ అమావాస్యా గురువారము డొల్లు కర్తరీ ప్రవేశము.

11-5-2000 వైశాఖ శుద్ధ అష్టమీ గురువారం కృత్తిక కార్తె నిజకర్తరీ ప్రవేశము.

28-5-2000 వైశాఖ బహుళ దశమీ ఆదివారం కర్తరీ త్యాగమగును.

### మౌఢ్య నిర్ణయము

గురు మౌఢ్యము: 24-4-2000 చైత్ర బహుళ షష్ఠీ సోమవారము పశ్చాదస్తమిత గురుమౌఢ్య ప్రారంభము. 21-5-2000 వైశాఖ బహుళ తదియా ఆదివారం ప్రాగుదిత గురుమౌఢ్య త్యాగము.

శుక్రమౌఢ్యము: 9-5-2000 వైశాఖ శుద్ధ షష్ఠీ మంగళవారం ప్రాగస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభము. 14-7-2000 ఆషాఢ శుద్ధ త్రయోదశీ శుక్రవారము పశ్చాదుదిత శుక్రమౌఢ్య త్యాగము.

## పుష్కర నిర్ణయము

2-6-2000 వైశాఖ బహుళ అమావాస్య శుక్రవారము శ్రీ నర్మదానదికి పుష్కర ప్రారంభము.

## గ్రస్తోదయ చంద్ర గ్రహణము (16-7-2000)

శ్రీ విక్రమ నామ సంవత్సర ఆషాఢ పూర్ణిమా ఆదివారం కేతుగ్రస్త గ్రస్తోదయ ఖచ్ఛన్న చంద్ర గ్రహణము సంభవించును. ఉత్తరాషాఢా నక్షత్రయుక్త ధనుర్మకర రాశులయందు కల్గును. పింగళ వర్ణము, దక్షిణ గోలము, సవ్య గ్రహణము.

| | | | |
|---|---|---|---|
| స్పర్శకాలము | ఐ.ఎస్.టి. | సా.గం|| | 5-27 ని|| |
| నిమీలన కాలః | ఐ.ఎస్.టి. | సా.గం|| | 6-32 |
| సూర్యాస్తమయ కాలః | ఐ.ఎస్.టి. | సా.గం|| | 6-40 |
| మధ్యకాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 7-25 |
| ఉన్మీలన కాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 8-18 |
| గ్రహణ మోక్ష కాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 9-24 |
| ఆద్యంత పుణ్య కాలః | | మొత్తం గం|| | 3-57 |
| బింబా దర్శన కాలః | | గం|| | 1-46 |

ఈ గ్రహణము రాత్రియందు సంభవించుచున్నందున పగటియందే యధావిధిగ, నిత్య భోజన ప్రత్యాబ్దికాదులాచరింపవలెను. ఉత్తరాషాఢ నక్షత్రము వారు, ధనుర్మకర రాశులవారు దీనిని చూడరాదు. గ్రహణానంతరము మరు దినము ఉదయము యధావిధిగ శాంతి జరిపించుకోవలెను.

## ఖచ్ఛన్న చంద్ర గ్రహణము (9-1-2001)

శ్రీ విక్రమ నామ సంవత్సర పుష్య శుద్ధ పూర్ణిమా మంగళవారము రాత్రియందు రాహుగ్రస్త ఖచ్ఛన్న చంద్ర గ్రహణము సంభవించును. పునర్వసు నక్షత్రము మిథున రాశియందు కల్గును. పింగళ వర్ణము, సవ్య గ్రహణము, దక్షిణ గోలము.

| | | | |
|---|---|---|---|
| స్పర్శకాలము | ఐ.ఎస్.టి. | రా.గం|| | 12-13 ని|| |
| నిమీలన కాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 1-19 |
| మధ్యకాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 1-50 |
| ఉన్మీలన కాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 2-22 |
| మోక్ష కాలః | ఐ.ఎస్.టి. | రా.గం|| | 3-29 |
| గ్రహణ ఆద్యంత పుణ్య కాలః | | మొత్తం గం|| | 3-16 |
| బింబా దర్శన కాలః | | గం|| | 1-03 |

ఈ గ్రహణము రాత్రియందు సంభవించుచున్నందున పగటియందే యధావిధిగ నిత్యభోజన ప్రత్యాబ్దికాదులాచరింపవలెను. పునర్వసు నక్షత్రమువారు మిధునరాశివారు దీనిని చూడరాదు. గ్రహణానంతరము మరుదినము శాంతి జరిపించుకోవలెను.

## రాజాది నవనాయక ఫలములు

### రాజా బుధః

శ్లో॥ సదాగతి స్పార్ద్ర సకృత్ప్రజానాం నరాస్త్రియోవారతికర్మహీనాః ।
ధారాధరాశ్చాప్య విముక్త ధారాః మధ్యాని సస్యానిభవంతి భూమౌ ॥

రాజ బుధుడయినందున పూర్వ సస్యములకు మధ్యమ ఫలితములు, వాయుపీడలుండును. శాస్త్రకారులకు వృద్ధి, రాజకీయ వడిదుడుకు లధికమగును. స్త్రీ పురుషులందు సమాగమము తక్కువగును.

### మంత్రీ గురుః

శ్లో॥ దేశక్షేమాభివృద్ధ్యర్థం ప్రజాసౌఖ్యకరం యథా ।
సన్మంత్రిణో మంత్రయంతి గురౌ మంత్రిపదం గతే ॥

మంత్రి గురుడవుట వలన ప్రజాక్షేమము, దైవకార్యాచరణములు వుండును. అధికారులు మెప్పును కోరుచుందురు. వర్షానుకూలము కల్గును.

### సేనాధిపతిర్గురుః

శ్లో॥ సేనాధిపే దేవగురౌధరిత్ర్యాం సువృష్టి రత్యంత జనానురాగః ।
దేవోత్సవో భూసుర యజ్ఞకర్మ రాజాప్రజాపాలన తత్పరస్స్యాత్ ॥

ఇందు సువృష్టి కల్గును. దైవకార్యాచరణములందు ప్రజలు ఆసక్తి కల్గి వుందురు. ప్రజలందు అత్యంత అనురాగములు వుండును.

### సస్యాధిపతిః సూర్యః

శ్లో॥ గోధూమ యవ ముఖ్యాని కుళుత్థచణకాని చ ।
సమృద్ధాని భవిష్యంతి రవౌ సస్యాధినాయకే ॥

ఇందు పూర్వ సస్యములకు ఈతిబాధలుండును. వులవలు, శనగలు, కందులు, వేరుశనగ, మిర్చి, సమృద్ధి కల్గి ధర సమముగ వుండును.

### ధాన్యాధిపతిః శుక్రః

శ్లో॥ అతివృష్టిస్సుభిక్షం చ ఫలితాధాన్య జాతయః ।
మానవానీ రుజాప్సర్వే శుక్రేధాన్యాధిపే సతి ॥

ఇందు అతివృష్టి, సుభిక్షము, తెలుపు ధాన్యములకు కొద్ది ధర హెచ్చు కల్గును. పశుక్షేమము బాగుండును.

### అర్ఘాధిపతిర్గురుః

శ్లో॥ సువృష్టిర్ధాన్యధనైర్విరాజితా భూమిర్మహోయజ్ఞ పరామహీసురాః ।
విల్యోత్సవా మంగళతూర్యవిస్స్వనై ర్భవంతి చార్ఘాధిపతౌ గురౌసతి ॥

ఇందు సువృష్టి, ధనధాన్య సమృద్ధి, యజ్ఞాది కర్మలయందు శ్రద్ధగను, శుభములు అత్యంతముగను జరుగుచుండును.

### మేఘాధిపతిర్గురుః

శ్లో॥ సస్యార్ఘవృష్టిభిస్తుష్టా భవేద్భూమిర్నిరంతరం ।
వీత రోగభయా స్సర్వేగురౌమేఘాధిపే సతి ॥

ఇందు కొన్ని ప్రాంతములు ధరలు, కాలమానము హెచ్చుతగ్గులుండును. అన్ని ప్రాంతములందు సమ వర్షములుండును. రోగభయములు కల్గుచు తక్కువగుచుండును.

### రసాధిపతిః కుజః

శ్లో॥ రజితం లవణం సర్వ తిలతైలగుడాదయః ।
శూన్యార్ఘం యాంతితే సర్వే భౌమే యదిరసాధిపే ॥

ఇందు నూనె, నెయ్యి, నువ్వులు, బెల్లము, వెండి ధరలు కొద్దిగ తగ్గి నిలబాటు కల్గును. మత్తుపదార్థములు ధర హెచ్చును.

### నీరసాధిపతిసూర్యః

శ్లో॥ నీరసాధిపతౌ సూర్యే తామ్ర చందనయోరపి ।
**రత్న మాణిక్యముక్తానాం జాయతే వృద్ధిరుత్తమా ॥**

ఇందు రాగి, మంచిగంధము, కర్పూరము, మణులు, దుంపలు, పాదరసము, సుగంధము, వస్త్రములు ధరసమము. వర్షాధిక్యత కల్గును.

## శ్రీ విక్రమనామ సంవత్సరములో గ్రహసంచారములు

### రవిచారః

చైత్ర శుద్ధ ౧౦ గురువాసరే మేషే రవిః; వైశాఖ శు.౧౧ ఆది వృషభే; జ్యేష్ఠ శు.౧౩ బుధ మిధునే; ఆషాఢ పూర్ణిమా ఆది కర్కాటకే; శ్రావణ బ.౧ బుధ సింహే; భాద్రపద బ.౩ శని కన్యాయాం; ఆశ్వయుజ బ.౪ మంగళ తులాయాం; కార్తీక బ.౫ గురు వృశ్చికే; మార్గశిర బ.౫ శుక్ర ధనుషి; పుష్య బ.౫ ఆది మకరే, మాఘ బ.౫ సోమ కుంభే; ఫాల్గుణ బ.౫ బుధవాసరే మీన రాశౌ ప్రవేశః.

### కుజచారః

చైత్ర బ.౬ మంగళవాసరే వృషభే; జ్యేష్ఠ శు.౬ బుధ మిధునే; ఆషాఢ బ.౬ శని కర్కాటకే; భాద్రపద శు.౯ గురు సింహే; ఆశ్వయుజ బ.౧౩ బుధ కన్యాయాం; మార్గశిర బ.౨ బుధ తులాయాం; మాఘ శు.౧౦ శని వృశ్చికే.

### బుధచారః

చైత్ర శు.౪ శని మీనే బుధః; చైత్ర బ.౮ బుధ మేషే; వైశాఖ శు.౭ గురు వృషభే; బ.౭ శుక్ర మిధునే; జ్యేష్ఠ బ.౬ శుక్ర బుధ వక్రారంభః; ఆషాఢ బ.౨ మంగళ వక్రత్యాగః; శ్రావణ శు.౪ గురు కర్కాటకే; బ.౪ శని సింహే; భాద్రపద శు.౬ సోమ కన్యాయాం; బ.౧౦ శని తులాయాం; ఆశ్వయుజ బ.౮ గురు వక్రారంభః; కార్తీక శు.౧౨ బుధ వక్రత్యాగః;

మార్గశిర శు.౩ బుధ వృశ్చికే; బ.౯ మంగళ ధనుషీ; పుష్య శు.౧౧ మకరే; మాఘ శు.౧ గురు కుంభే; శు.౧౧ ఆది బుధవక్రారంభః; ఫాల్గుణ శు.౩ సోమ వక్రత్యాగః; బ.౭ ఆది కుంభే ప్రవేశః.

### గురుచారః

వత్సరాది ప్రభృతి వైశాఖ బ.౩౦స్యా శుక్రవాసర పర్యంతం మేషరాశౌ సంచారః; తదాది వత్సరాంతం వృషభ రాశౌ సంచారః.

### శుక్రచారః

చైత్ర బ.౮ బుధవాసరే మేషరాశౌ ప్రవేశః; వైశాఖ బ.౭ శని వృషభరాశౌ; జ్యేష్ఠ శు.౧౭ మంగళ, మిధునే; ఆషాఢ శు.౮ శని కర్కాటకే ; శ్రావణ శు.౭ మంగళ సింహే; బ.౧౭ శనికన్యాయాం; భాద్రపద బ.౬ మంగళ తులాయాం; ఆశ్వయుజ బ.౧ శని వృశ్చికే; కార్తీక శు.౧౧ మంగళ ధనుషీ; మార్గశిర శు.౮ ఆది మకరే; పుష్య శు.౪ శుక్ర కుంభే; మాఘ శు.౩ శని మీనే; ఫాల్గుణ శుద్ధ పూర్ణిమా శుక్ర. శుక్రవక్రారంభః.

### శనిచారః

వత్సరాది ప్రభృతి జ్యేష్ఠ శు.౪ మంగళవాసర పర్యంతం శని మేషరాశౌ సంచారః; తదాది వత్సరాంతం వృషభ రాశౌ సంచారః; భాద్రపద బ.౧ గురువారం శనివక్రారంభః; పుష్య బ.౧౭ ఆది శనివక్రత్యాగః.

### రాహుః కేతుచారౌ

వత్సరాది ప్రభృతి ఆషాఢ బ.౧౪ ఆదివాసర పర్యంతం కర్కాటకే రాహుః, మకరే కేతు సంచారః, తదాది ఆవత్సర పర్యంతం మిధున రాశౌ రాహుః ధనూరాశౌ కేతుసంచారః.

* * *

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే | మఘ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 |
| 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 |
| **స్వాతి** | **విశా** | **అనూ** | **జ్యేష్ఠ** | **మూల** | **పూ-షా** | **ఉ-షా** | **శ్రవ** | **ధని** | **శత** | **పూ-భా** | **ఉ-భా** | **రేవ** | |
| 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | |
| 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | |

ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమసంఖ్యలు సమఫలమును, శూన్య సంఖ్యలు శూన్య ఫలితములను ఇచ్చును. మొదటనున్న రోగ భయము, మధ్య నున్న మనోభీతిని, చివరనున్న హానిని తెలుపును. ఒక్కొక్క సంఖ్య 4 మాసములుండును.

## ఆదాయవ్యయములు -- రాజపూజ్యావమానములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాశి | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|---|
| మేషం | 5 | 5 | మేషం | 3 | 1 |
| వృషభం | 14 | 11 | వృషభం | 6 | 1 |
| మిధునం | 2 | 11 | మిధునం | 2 | 4 |
| కర్కాటకం | 11 | 8 | కర్కాటకం | 5 | 4 |
| సింహం | 14 | 2 | సింహం | 1 | 7 |
| కన్య | 2 | 11 | కన్య | 4 | 7 |
| తుల | 14 | 11 | తుల | 7 | 7 |
| వృశ్చికం | 5 | 5 | వృశ్చికం | 3 | 3 |
| ధనుస్సు | 8 | 11 | ధనుస్సు | 6 | 3 |
| మకరం | 11 | 5 | మకరం | 2 | 6 |
| కుంభం | 11 | 5 | కుంభం | 5 | 6 |
| మీనం | 8 | 11 | మీనం | 1 | 2 |

సర్వాదాయము +105 - సర్వవ్యయము 96 = మిగులు +9.

## 2000-2001 శ్రీ విక్రమ నామ సంవత్సర కార్తెలు, వృష్టి నిర్ణయములు

| నెం. | కార్తెలు | తేదీలు | వారం | ప్రవేశం | నక్షత్రం | గణం | రాశి | ఫలితములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | భరణి | 28-04-2000 | శుక్ర | ఉ.10-18 | ధనిష్ఠ | రాక్షస | కుంభం | సమోష్ణము, మెట్టప్రాంత వర్షములు |
| 2. | కృత్తిక | 11-05-2000 | గురు | ఉ.5-17 | ఆశ్రేష | రాక్షస | కర్కా | ఉష్ణాధిక్యము, వాయు ప్రాబల్యము |
| 3. | రోహిణి | 24-05-2000 | బుధ | రా.2-38 | ధనిష్ఠ | రాక్షస | మకరం | సమోష్ణము, ఖండప్రాంతవర్షము |
| 4. | మృగశిర | 07-06-2000 | బుధ | రా.2-10 | మఘ | దేవ | సింహం | అత్యుష్ణము, ప్రాబల్యము, అనావృష్టి |
| 5. | ఆర్ద్ర | 21-06-2000 | బుధ | రా.3-07 | ధనిష్ఠ | రాక్షస | కుంభం | ఖండవర్షము, సువృష్టి, మిశ్రమ వాతావరణం |
| 6. | పునర్వసు | 05-07-2000 | బుధ | తె.4-51 | పుబ్బ | మనుష్య | సింహం | నిర్జలము, దాహకము |
| 7. | పుష్యమి | 20-07-2000 | గురు | ఉ.6-23 | శత | రాక్షస | కుంభం | ఖండప్రాంత తుఫానులు, అనావృష్టి |
| 8. | ఆశ్రేష | 03-08-2000 | గురు | ఉ.6-46 | పుబ్బ | మనుష్య | సింహం | అత్యుష్ణము, దాహకము |
| 9. | మఘ | 17-08-2000 | గురు | ఉ.5-29 | పూ.భా. | మనుష్య | కుంభం | మిశ్రమవాతావరణము, సువృష్టి, సస్యోచితం |
| 10. | పుబ్బ | 30-08-2000 | బుధ | రా.2-00 | ఉత్తర | మనుష్య | కన్య | జలప్రవాహములు, వర్షాధిక్యత |
| 11. | ఉత్తర | 13-09-2000 | బుధ | రా.7-48 | పూ.భా. | మనుష్య | కుంభం | సువృష్టి, సస్యోచితము |
| 12. | హస్త | 27-09-2000 | బుధ | ఉ.10-57 | ఉత్తర | మనుష్య | కన్య | మిశ్రమవర్షములు,అనావృష్టి,ఖండవృష్టి,తుఫానులు |
| 13. | చిత్త | 10-10-2000 | మంగ | రా.11-16 | పూ.భా. | మనుష్య | కుంభం | స్వల్పవర్షములు, వాయువు, సస్యోచితము |
| 14. | స్వాతి | 24-10-2000 | మంగ | ఉ.8-56 | పుబ్బ | మనుష్య | సింహం | ఉష్ణ ప్రాబల్యము, దాహకము |
| 15. | విశాఖ | 06-11-2000 | సోమ | ప.2-37 | శత | రాక్షస | కుంభం | మిశ్రమ వాతావరణం, జలసమృద్ధి, శీతలము |
| 16. | అనూరాధ | 19-11-2000 | ఆది | రా.9-00 | పుబ్బ | మనుష్య | సింహం | సమోష్ణము, సస్యోచితము |
| 17. | జ్యేష్ఠ | 02-12-2000 | శని | రా.12-02 | ధనిష్ఠ | రాక్షస | కుంభం | మిశ్రమము, ఖండప్రాంత స్వల్ప వర్షములు |

## మకర సంక్రమణ పురుష లక్షణము

ది. 14-1-2001 తేదీ శ్రీ విక్రమనామ సంవత్సర పుష్య బహుళ పంచమీ ఆదివారం ఉ.గం.9-47ని॥లకు ఉత్తర ఫల్గుణీ నక్షత్రము శోభనము యోగము, తైతుల కరణము కుంభ లగ్నమునందు రవి మకర రాశియందు ప్రవేశించి సంచరించును.

ఘోర నామధేయము - శూద్రులకు సుఖము, అగరుస్నానం - సువృష్టి, ప్రియంగు అక్షతలధారణ - పంటలకు నష్టము, గోరోజన గంధలేపనము - శుభకరము, పాండు (తెలుపు) వస్త్రధారణ - శుభము, కేతకీపుష్ప ధారణము - శుభప్రదము, వజ్రధారణ - వృష్టి వినాశనము, ఇనుప పాత్రయందు ఆహారము - శుభప్రదము.



అప్పముల భోజనము - స్ఫోటక భయము, నేరేడుపండు భోజనము - సర్వ జంతు శుభకరము, దంతాయుధము - చతుష్పదములకు పీడ, నీలఛత్ర ధారణము - రోగభయము, గాడిద వాహనము - రోగ భయ దాయకము, వైరాగ్య ముఖము - వర్షమధికము, పశ్చిమ గమనము - ఆయా ప్రాంతములకు అరిష్టములు మొ॥లగు లక్షణము లుండును.

కృష్ణపక్షమగుటవలన ఘభిక్ష క్షేమారోగ్యములు, జంతువులకు రోగములు, పంచమి తిథివలన జయము, ఆదివారంచే - హాహాకారము, కుంభ లగ్నము - జనక్షయము, 4వ ముహూర్తము అగుట వలన దాంబికము మొదలగు ఫలితములుండునని గ్రంథాంతరము.

### ఫలశ్రుతి

సంక్రాంతి పురుషోత్పత్తి కాలేదానం స్వశక్తితః
ఫలం కాంస్యాది దానాని దీయతే దోషనాశనం
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశు కాద్యం సతి లేక్షుగావః
ధాన్యం ఖరాంశోర్మకరప్రవేశే ఏతాని దానాని విశేషితాని
మకరస్తేతీక్ష భావేధాన్యం దానం కరోతియః
తేజసేరూప సామర్థ్యః సార్వభౌమ ప్రజాయతే
యశ్శృణోతి మధు కృష్ణ పక్షకే వర్షనాథ సచివాధికం ఫలం
ప్రాప్నుయాద్దురితముక్త విగ్రహశ్చాయురర్థమతులం యశశ్శుభం॥

## వర్ష ధాన్య ప్రమాణములు

వర్షం 15, ధాన్యం 15, శీతం 17, తృణం 9, ఉష్ణం 11, మారుతం 13, ప్రజావృద్ధి 15, ప్రజాక్షయం 15, రాజవిద్వరం 11, ఉగ్రం 11, పుణ్యం 5, పాపం 5, వ్యాధి 11, ఉపశమనం 7, ఆచారం 9, అనాచారం 5, జననం 17, మరణం 15, దేశస్వాస్థ్యం 15, చోరభయం 5, తన్నాశం 9, అగ్నిభయం 5, శాంతి 9, మృగోపద్రవం 11, క్షయం 7, కీటకభయం 11, నాశ 7, మూషికభయం 9, తన్నాశం 9, సర్పవృద్ధి 17, తన్నాశం 15, కామం 17, లోభం 11, మదం 11, మాత్సర్యం 17, సుఖం 7, భోగం 13, విడంబం 11, మనోవేదన 11, ద్వేషం 7, ప్రతిష్ఠ 19, అప్రతిష్ఠ 13, ద్యూతం 5, మత్తత 13, పురుషోత్పత్తి 5, స్త్రీ ఉత్పత్తి 13, ధాతువాదం 3, భయం 9, శౌర్యం 15, దుష్టశిక్షణ 3, శిష్టపాలన 7, సత్యం 11, అసత్యం 15, విశ్వాసం 5, అవిశ్వాసం 7, దయ 9, నిర్దయ 11, న్యాయం 13, అన్యాయం 15, జ్ఞానం 3, అజ్ఞానం 17, కాపట్యం 17, నిష్కపటం 9, ధార్మికం 17,అధార్మికం 17, గోమాయం 4, నాశ 13, సస్యకీటకవృద్ధి 10, నాశ 7, శలభవృద్ధి 13, తన్నాశనం 13, మశకవృద్ధి 13, నాశ 4, మత్కుణవృద్ధి 10, తన్నాశనం 13, వృశ్చికవృద్ధి 1, నాశ 10, వ్యాఘ్రవృద్ధి 13, నాశ 13, వ్రీహి 4, శాలి 10, కుళుత్థ 2, తిల 4, మాష 6, ముద్గర 14, సర్షప 8, చణక 4, ఆఢక 14, గోధుమ 12, క్రోద్రవ 14, ప్రియంగు 10, యావనాల 12, రాజమాష 14, నీవార 16, శింభి 12, క్షుద్బాధ 5, తృష్ట 7, నిద్ర 5, ఆలస్యం 9, ఉద్యోగం 3, శాంతం 1, క్రోధం 11, లోభం 13, మిత్రభేదం 13, మిత్రత్వం 7, ఫలనిష్పత్తి 11, ధేనువృద్ధి 2, తన్నాశం 1, మృగవృద్ధి 5, తన్నాశం 3, అశ్వవృద్ధి 5, తన్నాశం 5, దంతవృద్ధి 3, తన్నాశం 5, ఉష్ట్రవృద్ధి 4, తన్నాశం 4, విప్రవృద్ధి 5, తన్నాశం 4, క్షత్రియవృద్ధి 2, తన్నాశం 5, వైశ్యవృద్ధి 5, తన్నాశం 2, శూద్రవృద్ధి 1, తన్నాశం 3, మ్లేచ్ఛ వృద్ధి 4, తన్నాశం 3, సంకరవృద్ధి 3, తన్నాశం 1, నవరత్నవృద్ధి 3, తన్నాశం 5, స్వర్ణవృద్ధి 10, రజితవృద్ధి 10, తామ్రవృద్ధి 12, రీతివృద్ధి 6, కాంస్యవృద్ధి 4, అయోవృద్ధి 8, సీసం 10, రసం 6, అతివృష్టి 7, అనావృష్టి 13, శునకవృద్ధి 5, పనస 7, నారికేళ 16, మాదీఫలం 7, జంబీర 19, రంభాఫలం 7, చూతం 9, కపిత్థం 19, తింత్రిణీ 25, ధాత్రీఫలం 25, ఖర్జూర 9, అండజవృద్ధి 15, తన్నాశం 12, స్వేదజవృద్ధి 15, తన్నాశం 8, స్థావరం 11, తన్నాశం 4, జంగమవృద్ధి 13, తన్నాశం 5, స్వప్నం 10, సుషుప్తి 10, జాగృతి 12.

## మాసాధిపతులు - దైవనామాలు

| | మాసము | మగశిశువు | ఆడశిశువు |
|---|---|---|---|
| 1. | చైత్రము | కృష్ణ | భూదేవి |
| 2. | వైశాఖము | అనంత | కళ్యాణి |
| 3. | జ్యేష్ఠము | అచ్యుత | సత్యభామ |
| 4. | ఆషాఢము | చక్రి | పుణ్యవతి |
| 5. | శ్రావణము | వైకుంఠ | రూపవతి |
| 6. | భాద్రపదము | జనార్దన | ఇందుమతి |
| 7. | ఆశ్వయుజము | ఉపేంద్ర | ఇంద్రావతి |
| 8. | కార్తీకము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9. | మార్గశిరము | వాసుదేవ | వాగ్దేవి |
| 10. | పుష్యము | హరనాథ | పద్మావతి |
| 11. | మాఘము | గోవింద | శ్రీదేవి |
| 12. | ఫాల్గుణము | పుండరీకాక్ష | సావిత్రి |

## 2000-2001 శ్రీ విక్రమనామ సంవత్సర మాసాధిపతులు

| నెం. | ఇంగ్లీషు తేదీలు | తెలుగు మాసములు | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూ॥షా | కృత్తిక ఉత్తర ఉ॥షా | రోహిణి హస్త శ్రవణం | మృగ చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ॥భా | పుష్యమి అనూరాధ ఉ॥భా | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 5-4-2000 | చైత్రం | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని |
| 2 | 5-5-2000 | వైశాఖం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
| 3 | 3-6-2000 | జ్యేష్ఠం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 4 | 2-7-2000 | ఆషాఢం | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు |
| 5 | 1-8-2000 | శ్రావణం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 6 | 30-8-2000 | భాద్రపదం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 7 | 28-9-2000 | ఆశ్వయుజం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 8 | 28-10-2000 | కార్తీకం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |
| 9 | 26-11-2000 | మార్గశిరం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 10 | 26-12-2000 | పుష్యం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 11 | 25-1-2001 | మాఘం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 12 | 24-2-2001 | ఫాల్గుణం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |

ఫలితములు: జన్మ లేక నామ నక్షత్ర గడికి క్రింది వరుసలోని మాసాధిపతికి గల ఫలితములను ప్రక్క పేజిలో చూసుకోవలెను.

## మాసాధిపతుల ఫలితములు

రవి : పనులతొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పుప్రయాణము. దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం. శాంతికి - రుద్రాభిషేకం, సూర్యస్తుతి.

బుధ : బంధు గోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తక జనస్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్యసంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి. శాంతికి - విష్ణుభక్తి.

రాహు : ఆతృత, స్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం. గుండె జబ్బు, క్షయ, ఉబ్బసము వంటి దీర్ఘరోగ బాధ. శాంతికి - దుర్గాపూజ, రాహుస్తుతి.

గురుడు : ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతానసౌఖ్యం, పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణ, స్థిరవృద్ధి, సర్వశుభం.

కేతువు : బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనోచాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్య కర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది, పామువల్ల ప్రమాదం, తఱచుద్రవ్యనష్టం. శాంతికి - మహారుద్రాభిషేకం, కేతుస్తుతి.

చంద్రుడు : మాతృసౌఖ్యం, దధ్యన్న సౌఖ్యం, స్త్రీ సంభోగసుఖం, మనోనిర్మలత, ఆనందం, గౌరవం, కృషి, వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వ ప్రయత్నసిద్ధి, స్త్రీ సహాయం, శుభం.

శని : నల్లని జంతువుల వలన భయం, నల్లని వస్త్ర లాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచకార్యాచరణము, బుద్ధి మాంద్యము, అనవసర ప్రసంగము, విరక్తి, గర్భశూల, గుండెపోటు. శాంతికి - రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

శుక్రుడు : తెల్లని బట్టను ధరించుట, పరిమళ ద్రవ్యోప యోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధురపదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గో లాభం, సర్వం సుఖం.

కుజుడు : అధికారుల బెడద, ఆయుధముల వలన భయము, కార్యనాశనం, మనస్తాపం, మనో కాఠిన్యం, దక్షిణ, నైఋతి దిశ ప్రయాణం, ఔషధసేవ, ధనాలోచన, ధనమునకు యిబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకము. శాంతికి - శివునకు అభిషేకం, కుజస్తుతి.

* * *

## శ్రీ విక్రమనామ సంవత్సర వ్రతదిన పట్టిక

| 2000-2001 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతి పత్ | షష్ఠి | ఏకాదశి | ○ పూర్ణిమ | ప్రతి పత్ | ఏకాదశి | మాస శివ రాత్రి | ● అమావాస్య | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| ఏప్రిల్ 2000 | 5 | 10 | 14 | 18 | 19 | 30 | - | - | 8 | 9 | 10 | 11 | 27 |
| మే | 5 | 9 | 14 | 18 | 19 | 29 | 2 | 4 | 5 | 6 | 8 | 9 | 24 |
| జూన్ | 3 | 7 | 12 | 16 | 17 | 28 | 1,30 | 2 | 1,29 | 2,30 | 4 | 5 | 20 |
| జూలై | 2 | 7 | 12 | 16 | 17 | 27 | 29 | 1,31 | 26 | 27 | 2.29 | 2,30 | 18 |
| అగస్టు | 1,30 | 5 | 10 | 15 | 16 | 25 | 28 | 29 | 22 | 23 | 25 | 26 | 14 |
| సెప్టెంబరు | 28 | 4 | 9 | 13 | 14 | 24 | 26 | 27 | 19 | 20 | 21 | 22 | 10 |
| అక్టోబరు | 28 | 3 | 9 | 13 | 14 | 23 | 25 | 27 | 16 | 17 | 19 | 20 | 8 |
| నవంబరు | 26 | 2 | 7 | 11 | 12 | 22* | 24 | 25 | 12 | 13 | 15 | 16 | 4 |
| డిశంబరు | 26 | 2,31 | 7 | 11 | 12 | 21 | 24 | 25 | 10 | 11 | 13 | 13 | 1,29 |
| జనవరి 2001 | 25 | 30 | 6 | 9 | 10 | 20 | 22 | 24 | 6 | 7 | 9 | 10 | 25 |
| ఫిబ్రవరి | 24 | - | 4 | 8 | 9 | 18 | 21 | 23 | 2 | 3 | 5 | 6 | 21 |
| మార్చి | 26 | 1 | 6 | 9 | 10 | 20 | 23 | 24 | 2 | 3 | 5 | 6 | 20 |

* గుర్తుకు ముందు దినము స్మార్తులకు అని గ్రహించవలెను.

## వార, తిథి, నక్షత్ర శూలలు

**తూర్పునకు:** మంగళవారం శుభము. శని, సోమవారములు పనికిరావు. 23 ఘడియల పై శూల దోషములేదు. 1, 9 తిథులు, జ్యేష్ఠ, ధనిష్ట నక్షత్రములు, తులా, కుంభ లగ్నములు కూడవు.

**పడమరకు:** బుధ, గురువారములు శుభము. ఆదిత్య, శుక్రవారములు దోషములు. ఈ శూలదోషము 22 ఘడియల తరువాత లేదు. 6, 14 తిథులు, పుష్య, రోహిణీ నక్షత్రములు, ధనుస్సు, సింహము లగ్నములు కూడవు.

**ఉత్తరము:** ఆది, శుక్రవారములు శుభము. మంగళ, బుధవారములు దోషము. ఈ దోషము 25 ఘడియలు తరువాత లేదు. 2, 10 తిథులు, హస్త, పుబ్బ నక్షత్రములు, వృషభ, కన్యా లగ్నములు కూడవు.

**దక్షిణము:** శని, సోమవారములు శుభము. గురువారము దోషము. ఈ శూల దోషము 22 ఘడియలు తరువాత లేదు. 5, 13 తిథులు, శ్రవణం, అశ్వినీ నక్షత్రములు పనికిరావు. మీన, వృశ్చిక లగ్నములు కూడవు.

* * *

# ప్రశ్న ప్రకరణము

1. ప్రశ్నవిషయము : ప్రశ్నించిన వేళకు లగ్నము మేషమైనచో మానవవిషయము, వృషభమైన పశు విషయము, మిధునమైన ధన పరము, కటకమైన వ్యవహారము, సింహమైన రాజకీయము, కన్యయైన వధూ ప్రసక్తి, తులయైన లోహ విషయం, వృశ్చికమైన వ్యాధి, ధనుస్సయిన ధనపరము, మకరము మనోచింత, కుంభం గృహ విషయము, మీనమైన ప్రయాణ విషయము అని తెలుపవలెను.

2. పనియగునా? కాదా? : ప్రశ్నించినవేళకు లగ్నము మీన మిధున కన్యలైన శీఘ్రముగా పని యగును. తులా, కుంభ, వృషభములైన కార్యసాఫల్యము. మేష ధనుస్సింహము లందు కార్యాలస్యము, మకర, వృశ్చిక, కటకము లందు కార్య నాశనమని ఎరుగ వలెను.

3. పుట్టబోవునది స్త్రీ శిశువా? పురుష శిశువా? : ప్రశ్న లగ్నం నుండి 9-5-7-3 స్థానములందు రవి, కుజ, గురులున్నచో పుత్రుడని, 2-4-6 స్థానములలో చంద్ర, శుక్రులున్నచో పుత్రికయని, 2-4-6-8 స్థానములలో శని, బుధులున్నచో నపుంసకులని చెప్పవలెను. లగ్నాత్తు చతుర్థమున ఎన్ని గ్రహము లుండిన అందరు సంతానమని అనగా 2 వున్న కవలలని, 3 వున్న ముగ్గురని చెప్పటకూడా కలదు.

4. మరియొక పద్ధతి : గర్భిణీ స్త్రీ యొక్క నామాక్షరముల సంఖ్యను 7చే గుణించి దానికి ఆనాటి తిథి సంఖ్యను కలిపి, 9చే భాగించవలెను. మిగిలిన శేషము సరి సంఖ్యయైన స్త్రీ శిశువని, బేసియైన పురుష శిశువని తెలియవలెను.

5. ప్రయాణ లాభాలాభములు : తన నీడ వల్ల కలిగిన పాదచ్ఛాయల సంఖ్యను 3చే గుణించి 13 కలిపి 8చే భాగించగా శేషం 1 అయిన ధనలాభం, 2 ధన నాశనం, 3-4-7 అయిన ప్రమాదం, 5-6 అయిన శుభం, 8 అయిన ప్రాణాపాయ మని చెప్పవలెను.

6. దేశాంతర మేగిన వారు ఎప్పుడు వత్తురు? : ప్రశ్న లగ్నమున బుధ, చంద్ర, కేతువులున్నచో తిరుగు మార్గమందున్నాడని, గురు, శుక్రులున్న చేరువకు చేరినాడు. ఒకటి రెండు నాళ్ళలో రాగలడని, కుజ, రవులున్నచో ఇంకా అక్కడనే ఉన్నాడని, శని, రాహువులున్నచో అనారోగ్యము వలన రాలేకపోయినాడని తెలియవలెను.

7. మరి యొక్క పద్ధతి : ప్రశ్నించిన వానిని 27 అంకె లోపల ఒక అంకె చెప్పమని అది అశ్విన్యాది నక్షత్రములలో ఏ నక్షత్రమగునో చూచి, ఆర్ద్ర మొదలు ఆ నక్షత్రమువరకు లెక్కించి దానిని 7 చే భాగించగా శేషం 1 అయిన శీఘ్రముగా వచ్చునని, 2 అయిన అక్కడనే వున్నాడని, 3 అయిన యింటికి వచ్చుచున్నాడని, 4 సమీపమునకు చేరుకున్నాడని, 5 మార్గ మధ్య మందున్నాడని, 6 జబ్బుపడి యున్నాడని, 7 మృత్యు గతమని తెలియవలెను.

8. నష్టద్రవ్య ప్రశ్న : కేంద్ర, త్రికోణ, అష్టమ, ధన (4,7,10,11,9,8,2) స్థానములందు శుభ గ్రహ సంబంధము లేనివీ, పాప గ్రహ సంబంధముతోయున్న పాపులున్న యెడల పోయిన సొమ్ము దొరకదనియు, ఆ ప్రయత్నమందు మరికొంత ద్రవ్యము ఖర్చు అగుచేగాని ప్రయోజన ముండదని తెలుపవలెను. మరియు 1,5,9,2,3,10,11 స్థానములలో శుభ గ్రహములు బలవంతులై యుండగా 1,5,9,4,7,10,8,11 స్థానములలో పాప గ్రహములు లేని యెడల పోయిన సొమ్ము తిరిగి దొరుకునని చెప్పవలెను.

9. నక్షత్రమును బట్టి చోర ప్రశ్న : 1. రోహిణి, పుష్యమి, ఉత్తర, విశాఖ, పూర్వాషాఢ, ధనిష్ఠ, రేవతి -- అను యీ 7ను అంధక నక్షత్రము లనబడును. ఈ తారల యందు దొంగిలింప బడిన వస్తువులు తిరిగి లభించునని చెప్పబడినది. 2. మృగశిర, ఆశ్లేష, హస్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, అశ్విని -- ఇవి 7ను మందాక్షము లన బడును. ఈ తారలలో పోయిన సొమ్ము కొంచెము ప్రయత్నముపై లభించును. 3. ఆర్ద్ర, మఖ, చిత్త, జ్యేష్ఠ, అభిజిత్, పూర్వాషాఢ, భరణి -- ఈ 7ను మధ్యమములు. ఈ తారలందు పోయినవి తిరిగి లభించుట కష్టం. మిక్కిలి ప్రయాసముపై లభించిన లభించ వచ్చును. 4. పునర్వసు, పుబ్బ, స్వాతి, మూల, శ్రవణం, ఉత్తరాభాద్ర, కృత్తిక ఈ 7ను సులోచనము లనబడును. ఈ తారలలో పోయిన వస్తువులు తిరిగి దొరుకుట అరుదు అని రత్నమాలావచనము.

10. ఉద్యోగ ప్రశ్న : ప్రశ్న లగ్నమునకు 7, 10 స్థానములలో శుభ గ్రహములున్నను లేదా శుభగ్రహ వీక్షణమున్నను త్వరలో ఉద్యోగము లభించునని చెప్పవలెను.

11. పెండ్లి ఎప్పుడు జరుగును : ప్రశ్న లగ్నము మేషము లగాయితు సమరాశు లందుండి, శుక్రుడు సమరాశులలో యున్నచో త్వరలోనే పెండ్లి జరుగునని చెప్పవలెను.

## నవరత్నముల ఉంగరము

సర్వ గ్రహోపగ్రహములకు, పీడాపరిహారమునకును, చాలామంది ధరించదగినది నవరత్నముల ఉంగరము. ఇందు ఏఏ రత్నము ఎచ్చట నుండవలెనో ఈ దిగువ చిత్రమునందు చూపబడినది.

| ఈశాన్యం | | తూర్పు | | ఆగ్నేయం |
|---|---|---|---|---|
| | బుధ<br>పచ్చ | శుక్ర<br>వజ్రం | చంద్ర<br>ముత్యం | |
| ఉత్తరం | గురు<br>పుష్యరాగం | సూర్య<br>కెంపు | కుజ<br>పగడం | దక్షిణం |
| | కేతు<br>వైఢూర్యం | శని<br>నీలం | రాహు<br>గోమేధికం | |
| వాయవ్యం | | పశ్చిమము | | నైఋతి |

ఇట్టి ఉంగరము ధరించుటచే-దీర్ఘరోగములు, శతృత్వములు ఋణపీడలు తొలగిపోవును. ఆదాయము వృద్ధియగును. వ్యసనములు నశించును. సత్సాంగత్యము కల్గును. కుటుంబసౌఖ్యం, సత్సంతానం దైవభక్తి, సర్వసంపద్వృద్ధి కలుగును. చంద్రబలాదులును చూచుకొని ఇష్టదైవమునద్ద వుంచి పూజించి అనంతరము ధరించవలెను.

గమనిక: ఇది కొద్దిమందికి మాత్రము యోగ్యముకాదు. జ్యోతిష్కులను సంప్రదించి ధరించండి.



# వర్ష యోగములు

**చైత్రమాసము:** ఇందు రవి, కుజ, శనులకు మహావాయు బుధ, గురులకు రస, సౌమ్య, దహన నాడులందును సంచారము శు.1 నుండి బ.7 వరకు శని కుజ గురులకు ఏకరాశి స్థితి మరియు మాసమంతయు గ్రహములకు పంచానన, చాతుర్ గ్రహ కాల సర్పయోగములు కల్గినవి. మాసమంతయు వాతావరణం పొడిగా వుండును. సామాన్య వర్షములు కల్గును. చాంద్రయోగములచే ఏప్రిల్ 6,10,11,12, 20, మే 2,3 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

**వైశాఖమాసము:** ఇందు బుధునికి వాయు, దహన నాడులందును తక్కిన గ్రహములన్నింటికి మహావాయు నాడియందు సంచారము. బ.3 గురూదయం, శు.6 శుక్రాస్తమయము. పురోబుధుడు, పురోఅంగారకుడు. శు.పాడ్యమి నుండి 4 వరకు షష్ఠ గ్రహ కూటమి. మాసమంతయు కాలసర్పయోగము కలవు. మాసమంతయు వేడి అధికము. చాంద్రయోగములచే మే 8,11,12,19,21,22,29,30 స్వల్పముగా ఆకస్మిక వర్షములు కలవు.

**జ్యేష్ఠమాసము:** ఇందు గ్రహములన్నింటికీ వాయు దహన నాడులందును, బుధునికి సౌమ్య నాడులందును సంచారము కలదు. బ.షష్ఠి - బుధ వక్రారంభము. శుద్ధమున పంచగ్రహకూటమి. శు.చవితి - పంచమిలందు షష్ట గ్రహ కూటమి - మాసమంతయు కాలసర్పయోగము, శుక్రాస్తమయము కలవు. చాంద్ర యోగములచే అనావృష్టి యోగము హెచ్చు. బ. పంచమి ప్రాంతమున తొలకరించును. జూన్ 6,7,12,18,19,22,23,26 తేదీలయందు అతివృష్టి అనావృష్టి యోగములు ఉన్నవి.

**ఆషాఢమాసము:** ఇందు రవి, కుజ, బుధ, శుక్రులకు రజల, సౌమ్య, శని గురులకు మహావాయు నాడులందును సంచారము కలదు. శుద్ధమున పంచమ గ్రహకూటమి, మాసమంతయు కాల సర్పయోగం కలవు. శు.సప్తమి బుధో వక్రీ బుజః శుక్రః. వాతావరణము చాలా వరకు చల్లబడును. చాంద్రయోగములచే జూలై 8,9,10,17,20,23 తేదీలలో ఆకస్మిక వర్షములు ఉండును.

**శ్రావణమాసము:** ఇందు రవి, కుజ, బుధ, శుక్ర గ్రహములకు జల, అమృత శని గురులకు మహావాయు, వాయు నాడులందును సంచారము. శు.విదియ నుండి మఘాదిపంచక శుక్రుడు, పురః శుక్ర రవి మధ్యమం. బ.ద్వాదశి నుండి పురః శుక్ర రవి మధ్యమం. పతంగ మార్గ కుజుడు, కాలసర్పయోగ భంగము కల్గినది. చాంద్రయోగములచే ఆగష్టు 1,2,9,10,11,14,15,16 తేదీలయందు వర్షయోగములు కలవు. మాసమంతయు ఎండ, వానలు సమానముగా ఉండును. జలసమృద్ధి, కొన్ని ప్రాంతములందు వరదలు సంభవించును.

**భాద్రపదమాసము:** ఇందు గురు, శని, శుక్ర గ్రహములకు వాయు నాడియందును, రవి, బుధ, శుక్రులకు రస, జలనాడులందును. బ.పాడ్యమి శని వక్రారంభం కలవు. శు.షష్ఠి వరకూ పురః శుక్రః రవి మధ్యమం. మఘాదిపంచక శుక్రుడు. శు.నవమీ సింహ అంగారకుడు. శుద్ధమున, అమావాస్య ప్రాంతమున భారీ వర్షములు కల్గును. చాంద్రయోగముచే సెప్టెంబరు 1,2,8,9,12,13,14,22,23,26,27 తేదీల యందు చక్కని వర్షములు కురియును.

ఆశ్వయుజమాసము: ఇందు గురు, రవి, బుధ శుక్ర గ్రహములన్నింటికీ వాయు మహావాయు నాడీ, కుజునికి రస, జలనాడులందును సంచారము. మాసమంతా పశ్చిమ దిశి సింహ అంగారకుడు. ప్రాగ్దిశి స్వాతిత్రయ బుధ శుక్రులు, మాసమందు గాలి, వాన, వాతావరణ కాలుష్యము, మిశ్రమ వాతావరణం, ఖండప్రాంత వర్షములు కల్గును. బహుళమున అనావృష్టి కల్గును. చాంద్రయోగముచే అక్టోబరు 1,2,6,7,13,14,18,19,26,27 తేదీలందు వర్షములు కురియును.

కార్తీకమాసము: ఇందు గ్రహములన్నింటికీ వాయు, మహావాయు నాడులందు సంచారము కలదు. కుజ శుక్రులకు సౌమ్యనాడి సంచారము. శుద్ధమున బుధోవక్రీ బుజు శుక్రః పశ్చిమ దిశి కన్యాంగారకుడు. పురః శుక్ర రవి మధ్యములు కలవు. శు.ద్వాదశీ బుధవక్రత్యాగం. పూర్ణిమా ప్రాంతమున అధిక వర్షములు. తుఫాను భీభత్సములు కల్గును. వాయు ప్రాబల్యం అధికంగా ఉండును. శుద్ధమున గాలితో కూడిన స్వల్ప వర్షములు కల్గును. చాంద్రయోగముచే నవంబరు 10,15,21,23, 24 తేదీలలో వర్షములు కురియును.

మార్గశిరమాసము: ఇందు గ్రహములన్నింటికీ వాయు, మహావాయు, దహననాడులలో సంచారము కలవు. శుక్రునికి సౌమ్య, రస, జల, అమృతనాడులందు సంచారము కలదు. మాసమంతయు పురః శుక్రః రవి మధ్యమం, బ.విదియ నుండి కుజ శని గురు షష్టాష్టకం కలవు. పూర్ణిమా ప్రాంతమున శీతల వాయువులు అధికంగా ఉండును. మంచు దట్టముగా ఉండును. చాంద్రయోగములచే నవంబరు 26,27 డిశంబరు 2,3,4,14,15,16 తేదీలలో ఆకస్మిక వర్షములు కల్గును.

పుష్యమాసము: ఇందు కుజ, గురు శనులకు వాయు, మహావాయు నాడులందును. రవి, బుధ, శుక్రులకు సౌమ్య రస జల అమృత నాడులయందును సంచారము కలవు. మాసమంతయు పురః శుక్ర రవి మధ్యమం. బ.ద్వాదశీ వరకు పురోగురు శని వక్రం కలదు. స్వాతిత్రయ కుజుడు కలదు. మాసమంతయు వాతావరణం మబ్బులుగా పొడిగా ఉండును. చాంద్రయోగములచే డిశంబరు 26, 27, జనవరి 8,9,12,16 తేదీలందు ఖండప్రాంత వర్షములు కురియవచ్చు.

మాఘమాసము: ఇందు కుజ గురు శనులకు మహావాయు నాడియందును, రవి బుధులకు అమృత, జలనాడులందును సంచారము కలదు. బ.దశమి వరకు గురు కుజ షష్టాష్టకం బ.దశమి నుండి శని కుజ సమసప్తకము. చాంద్ర యోగములచే జనవరి 29,30 ఫిబ్రవరి 4,5,8,14,15,19,20 తేదీలందు ఆకస్మికముగా సామాన్య వర్షములు కురియును.

ఫాల్గుణమాసము: ఇందు కుజ గురు శని గ్రహములకు వాయు మహావాయు నాడులందును రవి బుధులకు అమృత జలనాడులందును సంచారము కలదు. మాసమంతయు పురః శుక్ర రవి మధ్యమము కలదు. శని కుజ సమసప్తకము. శు.త్రయోదశీ వరకు స్వాతిత్రయ అంగారకుడు కలదు. శుద్ధమున తరచు తుషారము, ఉష్ణప్రాబల్యం, తూర్పు ఉత్తర ప్రాంతములందు గాలితో కూడిన అధిక వర్షములు కురియును. చాంద్రయోగములచే ఫిబ్రవరి 25,26, మార్చి 15 ప్రాంతములలో మబ్బు వాతావరణం మరియు వేడి గాలులు కల్గును.

* * *

## సరకుల ధరలు

చైత్రమాసము: శు. దశమి నుండి పసుపు, ధాన్యం, వస్త్రములు, నూలు, గోధుమలు ధర నిలబాటు. మిర్చి, చింతపండు, ఆవాలు, వాలాజీ, జీలకర్ర కొద్ది ధర హెచ్చి నిలబాటు కల్గును. షేర్లు పౌర్ణిమ ప్రాంతమున ఆకాశాన్నంటును. తూర్పు ప్రాంతమున పంటలు కరువు. బహుళమున పశువులు, తైలములు, శనగలు ధర పలుకును.

వైశాఖమాసము: ఇందు ఇనుము, బంగారము, వస్త్రములు, కూరలు, కుంకుళ్ళు, బెల్లం, క్రమముగా పెరుగును. శుద్ధమున బంగారము ధర సమము. అరటి, వస్త్రములు, తైలములు, ముత్యాలు క్రమేణ పెరుగును. అమా, ప్రాంతమున శనగలు, వస్త్రములు, పశువులు ధర హెచ్చును. మిర్చి, పసుపు తగ్గు ముఖంలో నిలబాటు.

జ్యేష్ఠమాసము: తిల తైలాదులు గిరాకీ. శు.షష్ఠి నుండి పసుపు, వెల్లుల్లి, మిర్చి, బంగారం గిరాకీ, శనగలు మాసమంతయు బెల్లం గిరాకీ. బహుళమున కొబ్బరి, వేరుశనగ, సుగంధ ద్రవ్యములు నిలబాటు.

ఆషాఢమాసము: గోధుమలు, మిర్చి, చింతపండు గిరాకీ. షేర్లు మందం, వస్త్రములు, ముత్యములు, పట్టు, చక్కెర ధర హెచ్చును. పండ్లు, ఫ్యాన్సీ వస్తువులు ధర హెచ్చును. బొగ్గు కలప, పెసలు, సిమెంటు, స్టీలు, బంగారము ధర తగ్గును. కొబ్బరి, పట్టు, బెల్లం, నువ్వులు, ఎరుపు ధాన్యాలు, పగడములు, కొర్రలు, అలచంద ధర పెరుగును. ధాన్యం ధర మందమగును.

శ్రావణమాసము: ధాన్యం ధర హెచ్చును. కొబ్బరి, బెల్లం, వెల్లుల్లి, కుంకుళ్ళు, చింతపండు, మిర్చి సమయానుకూలముగా విక్రయించిన లాభము. బంగారము లోహ జాతులు ధర హెచ్చును. బహుళమున కూరలు, వస్త్రములు చురుకు. చింతపండు, పసుపు బహుళమున హెచ్చును. శ్రీఫలము, సుగంధ ద్రవ్యములు బంగారము, లోహములు పౌర్ణమి ప్రాంతమున ధర హెచ్చును.

భాద్రపదమాసము: ఈ నెల శుద్ధమున చింతపండు, మిర్చి, కుంకుళ్ళు, పసుపు, ఆవాలు, శనగలు ధర పెరుగును. పూర్ణిమా ప్రాంతమున వస్త్రములు, పువ్వులు గిరాకీ. బంగారము, పట్టు వస్త్రములు హెచ్చి నిలబడును. శు.సప్తమి, బ.తదియ లందు తైలములు, చింతపండు గిరాకీ. గృహ నిర్మాణ సామగ్రి ధర నిలబాటు.

ఆశ్వయుజమాసము: ఈ మాసమంతయు బంగారము, వెండి లోహములు ధర హెచ్చును. బ.చవితి ప్రాంతమున చింతపండు, బెల్లం, పసుపు ధర వ్యత్యాసము. కొబ్బరి, రత్న జాతులు, పట్టుధర నిలబాటు. బహుళమున కొబ్బరి, మిర్చి ధర హెచ్చు.

కార్తీకమాసము: బంగారము, ధాన్యం, కొబ్బరి, ఆవాలు, కొర్రలు, జాజికాయ ధర హెచ్చు. వ్యాపారస్థులకు మిశ్రమ వాతావరణము. షేర్లు స్వల్పముగా పెరిగి నిలబాటు. పట్టు, సుగంధ ద్రవ్యములు, కంద పుగాకు పెరిగి నిలబాటు. కొబ్బరి, కాయగూరలు ధర పెరుగుదల. సిమెంటు, కలప, ఇసుక, గృహోపకరణములు పెరుగును. మాసె, నెయ్యి, రస ద్రవ్యములు మందము.

మార్గశిరమాసము: ఈనెల బంగారము, గోధుమలు, ధాన్యము ధర తగ్గి హెచ్చును. వస్త్రములు, అపరములు, చింతపండు, మిర్చి, కలప, సిమెంటు ధర పలుకును. బహుళమున బంగారము, రాగి వస్త్రములు, మానెలు ధర పెరుగును. కొబ్బరి, మిర్చి, చింతపండు ధర పెరుగును. షేర్లు, రైస్ మిల్లర్లు, వస్త్రములు ధర పెరుగును.

పుష్యమాసము: ఈ మాసమంతయు గృహోపకరణములు, ధాన్యము స్వల్పముగా పెరిగి నిలబాటు. షేర్లు మిశ్రమము. బెల్లం, కొబ్బరి, వేరుశనగ స్వల్పముగా పెరిగి నిలబాటు. ధనియాలు, వెల్లుల్లి గిరాకీ. ఫలపుష్పాదులు, చింతపండు బాగా గిరాకీ. తైలములు ఇనుము ధర పెరుగును. షేర్లు ధర పెరుగును. ధాన్యం గిరాకీ. మాసాంతమున చింతపండు బెల్లం తగ్గుదల, అపరములు, ఎరువులు నిలబాటు. మిరియాల్లు పెరుగును.

మాఘమాసము: బంగారము గిరాకీ. మిర్చి, మిరియాలు, ఆవాలు, బెల్లం, చింతపండు స్వల్పముగా పెరుగును. షేర్లు గిరాకీ, ఫల పుష్ప జాతులు, భూమి, అపరములు, శుద్ధమునందు పెరుగును. కలప, గోధుమలు, మిర్చి, పశువులు ధర హెచ్చును. పసుపు, చింతపండు క్రమంగా స్వల్పముగా పెరుగును. మొత్తం మీద మాసమంతయు వ్యాపారము బాగుగా సాగును. ఇటుక, సిమెంటు, కంకర, సుగంధ ద్రవ్యములు ధర హెచ్చును. బంగారము, వస్త్రములు, లోహములు ధర గిరాకీ.

ఫాల్గుణమాసము: బంగారము హెచ్చును. మిర్చి, ఆవాలు, చింతపండు ధర నిలబాటు. ముత్యాలు, పట్టు వస్త్రాలు, మానె, గృహోపకరణములు, వాలాజీ, ధాన్యములు పెరుగుదల. వస్త్రములు, ఎర్ర ధాన్యములు, తైలములు ధరమందము. యంత్రములు శ్రీఫలము, కందగడ్డలు, కొబ్బరి, ధాన్యం బహుళమున గిరాకీ. షేర్లు, గృహోపకరణములు ధర మిశ్రమము. బంగారము, లోహములు ధర పెరుగును. పసుపు గిరాకీ. యంత్ర సామగ్రి ధర పెరుగును. చింతపండు, ఆవాలు, ధనియాలు శుద్ధమున గిరాకీ. ధాన్యము హెచ్చు.

* * *

# శ్రీ విక్రమనామ సంవత్సర రాశి ఫలితములు

## మేషరాశి

### (అశ్విని 1,2,3,4 పాదములు, భరణి 1,2,3,4 పాదములు, కృత్తిక 1వ పాదము)

ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 3 అవమానం: 1

ఈరాశి వారికి గురుడు ఉగాదినుండి జూన్ 2 వరకు జన్మమందు సువర్ణమూర్తి. తరువాత వత్సరమంతయు 2ట రజితమూర్తి, శని జూన్ 6 వరకు జన్మమందు రజితమూర్తి తరువాత వత్సరమంతయు 2ట సువర్ణమూర్తి, జూలై 30 వరకు రాహువు 4ట, కేతువు 10ట రజితమూర్తులు, తరువాత వత్సరమంతయు రాహువు 3ట, కేతువు 9ట సువర్ణమూర్తులు.

ఈ రాశివారికి గురుడు జూన్ 2 వరకు జన్మమందు $\frac{1}{2}$ ఉపకారి. తరచు గమనమును ఒడిదుడుకులను శత్రువృద్ధిని కలిగించును. నైసర్గిక శుభుడుగాన మూర్తమంతముచే తటస్థ ఫలితమును ఇచ్చును. శని జన్మమందు అపకారి మూర్తమంతముచే స్థానాధిపత్యముచే కొంతవరకు యోగించగలడు. రాహుకేతువులు జూలైవరకు పాపులు.

ఈ రాశివారు వీరత్వము, శూరత్వము, వ్యవహార దక్షత, వాక్చాతుర్యము, దూరదృష్టి కలిగిఉందురు. స్వలాభము లేనిదే పేపనీ చేయరు. రాహు, కేతువుల ప్రభావముచే యత్న ఉద్యోగ ఆశాభంగము, ఇంట బయట అశాంతి ఉండును. పరపీడనము, మోకాలినొప్పులు, జంతుభీతి, చోరభయములు కలుగుచుండును. జూలై తర్వాత సౌఖ్యము, కార్యదక్షత, ప్రయాసతో ధనార్జన, శుభకార్యసిద్ధి, కవితాది సద్గోష్టి, నేత్ర చికిత్స ఔషధసేవలు చేయవలసి వచ్చినను మంచి కల్గును. తమ మేధాతత్వమును ఇతరులకు ఉపయోగించుదురు.

వ్యవసాయదారులకు రెండవ పంట ఫలించును. ఉద్యోగులకు, శాస్త్రకారులకు, కళాకారులకు ఉత్తరార్ధము యోగించును. ఆర్థికవృద్ధి, నూతనవ్యాపార ప్రారంభములు, స్థిరాస్తి అనుకూలమార్పులు కల్గును. గృహ నిర్మాణములు ఆలస్యంగా అగును. విద్యార్థులు అత్యధిక శ్రద్ధ చూపించినకాని ఉన్నతి పొందలేరు. సైన్సు, ఆర్ట్సు విద్యార్థులకు కొంతవరకుమేలు. టెక్నికల్ విద్యార్థులకు సంవత్సరాంతము ప్రోత్సాహకరము, వ్యాపారులకు జాయింట్లు స్వల్పముగా యోగించును. సినిమా, న్యాయవాద, వైద్యవృత్తుల వారికి 8,9,11 మాసములు యోగించవు. అపరములు, కలప, కిరణా, ధాన్యం వ్యాపారులకు మిశ్రమముగానున్న సంవత్సరాంతమున ఉత్సాహకరము. కోళ్ళు, మత్స్య పరిశ్రమలు, షేర్లు వ్యాపారులకు తైల వస్త్ర వ్యాపారులకు నట గాయకులకు 7,8,9,1,2, మాసములు విశేష ఫలితములు కల్గును. సంఘ గౌరవము, అభివృద్ధి, భూలాభములు కలసివచ్చును. శుభకార్యములు, దూరప్రయాణములు ఆశించువారికి 7,8,2,3 మాసములు కలసివచ్చును.

ఏప్రిల్, మే లందు కుజప్రభావముచే కార్యవిఘ్నములు స్త్రీ సంబంధ వైరము, రక్తదర్శనము, మాట నిలకడ లేకుండుట, వృత్తియందు అసంతృప్తి మొదలగు ఫలితములు ఉండును. బుధ, శుక్ర ప్రభావముచే అయత్న స్వల్ప ఋణవిముక్తి. పుణ్యదాన కర్మాశక్తత. స్వల్ప ధన లాభము కల్గును. 6,7 మాసములందు బాహుమనోబలము, సోదరప్రేమ ఆకస్మిక ధనలబ్ధి మితభాషణము, అలంకార వస్త్రధారణ, వర్తక బంధు మిత్రలాభము, యవ్వన భోగము. 8,9 మాసములందు ఉద్యోగ అధికార గౌరవములు, పదోన్నతి, వ్యాపారవృద్ధి, స్వల్ప భూలాభము, అజీర్తి, ఒంటరి జీవితాభిలాషణము మోకాలి నొప్పులు, 10,11 మాసములందు సరససల్లాపాలు, బహుకోరికలు, ప్రతిపనియందు నిమగ్నత, గుప్తరోగపీడ, మృష్టాన్నభోజనము, వాహన అశాంతి, చిన్న చిన్న సమస్యలు కలిగి నివారితములు అగును. మిగిలిన మాసములందు కుటుంబ ఆనందము, ఉన్నత స్నేహ, వస్తు లాభములు కల్గును. శుభకార్యాదులు, గృహనిర్మాణాదులు ఆశించవచ్చును.

అశ్వివారికి వైఢూర్యము - భరణివార్కి నీలము, వజ్రము, - కృత్తిక వార్కి కెంపు, ముత్యము ధరించిన సంతుష్టి, అభివృద్ధికల్గును.

మొత్తంమీద ఈ రాశివారికి జూలై, ఆగష్టు, సెప్టెంబరు, ఫిబ్రవరి, మార్చి మాసములందు ఆశించిన ఫలితములు తప్పనిసరిగా నెరవేరును. శనీశ్వరునికి, ఈశ్వరునికి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వార్లకు అభిషేకములు, లక్ష్మీగణేశ్వర పూజలు, నవగ్రహజపశాంతులు, శని, సోమ వార నియమములు విశేష ఫలితములు ఇచ్చును. అదృష్ట సంఖ్య 9. మరియు 2,3,8 తేదీలు సంఖ్యలు యోగించును.

స్త్రీలు గురు, మంగళ వారములు, లక్ష్మి, లలిత, ఆంజనేయ పూజలు చేయుచుండుట అత్యంత యోగదాయకము.

## వృషభరాశి

(కృత్తిక 2,3,4 పాదములు, రోహిణి 1,2,3,4 పాదములు, మృగశిర 1,2 పాదము)

ఆదాయం: 14 వ్యయం: 11 రాజపూజ్యం: 6 అవమానం: 1

ఈ రాశివార్కి గురుడు జూన్ 2 వరకు 12ట రజితమూర్తి. తదాది వత్సరమంతయు జన్మమందు సువర్ణమూర్తి. శని జన్మమందు జూన్ 6 వరకు లోహమూర్తి. తదాది వత్సరమంతయు జన్మమందు సువర్ణమూర్తి, జూలై 30 వరకు రాహువు 3ట కేతువు 9ట తరువాత వత్సరమంతయు రాహువు 2ట, కేతువు 8ట సువర్ణమూర్తులే.

వీరికి గురుడు మిశ్రమ ఫలితప్రదుడు. కష్టనష్టములను సమముగా కల్గించును. జూన్ నుండి శతృమిత్రత్వ ములను, మిత్రశతృత్వములను వృధావ్యయము, ప్రయాసలను కల్గించుచుండును. నైసర్గిక శుభత్వముచే నిదానమును, హుందాతనమును, దూరాలోచనలను కల్గించుచుండును. శని ప్రభావముచే మందబుద్ధిని దుర్వ్యయములను, శ్రమ, త్రిప్పట, అలసత్వము, పితృఅనారోగ్యము, అజాత శతృభీతి, నేత్రపీడనము మనోవ్యాకులత, నల్లని జంతుభీతి, మొదలగు ఫలితములను ఇచ్చును. ఈరాశివారు ఎంతటి భారములైననూ సమర్ధముగా మోయు సమర్దులు. సమయస్ఫూర్తి, స్నేహభావము వీరికి ఉండును. ఏలినాటిశని అయినా ఈ రాశివారికి స్థానాధిపత్యముచేతనూ, మూర్తిమంతముచేతను యోగించును. స్థిరాస్తులను, భూగృహ నిర్మాణములను కొద్ది శ్రమతో అయిననూ పొందుదురు. వివాహవిషయములలో నిలబాటు కల్గును, నిదానించవలెను.

రాహు ప్రభావముచే జూన్‌వరకు గాంభీర్యమును, స్వల్పధనలబ్ధిని పొందుదురు. జూన్ తర్వాత ఆకస్మిక కలహములను, ఆరోగ్యము, వ్యవహారము గత ఋణములు గురించి ధనము వెచ్చించక తప్పదు. తరచూ నోటిపూతలు, కంఠము, నడుము, ఉదర సంబంధమైన భాదలు కల్గుచుండును. అష్టమకేతువు మనోదుర్భలత్వమును, భయమును స్వల్పముగా కల్గించుచుండినా గురు దృష్టిచే యోగించును.

ఇంజనీరింగ్, వైద్య విద్యార్థులకు, శ్రమకు తగ్గ గుర్తింపుకల్గును, ఉన్నతినొందగలరు. గణితము, న్యాయవాద, భాషేతర విద్యార్థులకు పరీక్షాకాలము.

వ్యవసాయదారులకు శ్రమమిగులును. ఉద్యోగులు, కళాకారులు, స్వయంవృత్తులవారికి అధికారిక ఒత్తిడులు, స్థానచలనములు తప్పవు. యాంత్రిక, తైల, లోహ వ్యాపారులకు సంవత్సర ఉత్తరార్ధము కలసివచ్చును.

మత్స్యకారులకు, కోళ్ళు, సినీ వృత్తి వ్యాపారులకు నిలుపుదల లేక స్వల్పకాలిక వ్యాపారములు యోగించవచ్చు. జాయింటుదారులకు, కాంట్రాక్టర్లకు నిదానము అవసరము. స్పెక్యులేషన్ కొంతవరకు యోగించును. రాజకీయము నష్టపరచును.

4,5 మాసములలో పరాక్రములైనా అశ్రద్ధ, శస్త్రచికిత్స, తస్కరభీతి కార్యవిఘ్నములు ఉండును. కృషియందు పటుదలచే లబ్ధి.

6,7 మాసములందు శిరోబాధ, ఉష్ణతత్త్వము, నేత్రపీడనము, మాటతొందర, పూర్వవస్తువ్యయము, గృహమార్పులు.

8,9 మాసములందు మనో ఆనందము, భోగము. ఉద్యోగాదియత్న సిద్ధి, స్త్రీ సుఖము, వేర్పు, సుందరదేహచ్ఛాయ, పరోపకారము, సంతానంగురించి శ్రద్ధ చివరియందు స్వల్పమనస్తాపము.

10,11 మాసములందు కార్యసిద్ధి, శని గురుల వక్రముచే స్థానచలనం, విశేష అయత్న లాభము. స్వల్పవ్యయములు నిదానముచే సుసంపన్న కార్యసిద్ధి. కళత్ర ఆరోగ్యలోపము, ప్రయాణ ప్రతికూలతలు.

డిశంబరు, జనవరి మాసములందు మనోవాంఛ ఫలసిద్ధి, నూతన ప్రయత్నములు వ్యవసాయ, వ్యాపారలాభములు. స్త్రీమూలంగా ధనలాభములు. మిగిలిన మాసములందు నిధానముచే యత్న లాభములు, భూగృహ వ్యాపార లాభములు.

కృత్తిక వారు కెంపు, నీలమణి - రోహిణివారు ముత్యము - మృగశిరవారు పగడము, పుష్యరాగం ధరించుట మంచిది.

ఈ రాశివారు దుర్గా, విష్ణు, లక్ష్మీనరసింహ దత్తాత్రేయపూజలు, మంగళవారములు,ఆదిత్య శనివారములు సంపూర్ణ నవగ్రహజపములు అన్నశాంతి చేయుటద్వారా ఉత్సాహాన్ని సత్ఫలితాన్ని పొందగలరు.

ఈ రాశివారి అదృష్ట సంఖ్య 6. 4,5,8 తేదీలు సోమ, బుధ, శనివారములు కలిసివచ్చును. స్త్రీలు శివలింగదర్శనము, దుర్గా, గౌరీ పూజలు, ఆంజనేయ స్తోత్రములు చేయుటద్వారా కుటుంబమందు శాంతి, ధనవృద్ధి, ఆరోగ్యములు కల్గును.

## మిధునరాశి

(మృగశిర 3,4 పాదములు, ఆర్ద్ర 1,2,3,4 పాదములు, పునర్వసు 1,2,3 పాదములు)

**ఆదాయం: 2 వ్యయం: II** **రాజపూజ్యం: 2 అవమానం: 4**

ఈ రాశివార్కి గురుదు ఉగాది నుండి జూన్ 2 వరకు 11ట మరియు సంవత్సరాంతము వరకు 12ట లోహమూర్తి. శని, జూన్ 6 వరకు 11ట తామ్రమూర్తి తదుపరి వత్సరమంతయు 12ట రజితమూర్తి. రాహువు 2ట కేతువు 8ట జూలై 30 వరకు లోహమూర్తులు. తరువాత వత్సరమంతయు రాహువు జన్మమందు కేతువు 7ట రజితమూర్తులు.

వీరికి గురుడు వత్సరమంతయు సామాన్య యోగ్రపదుడే. ఆకస్మిక అస్థిమితము, ధనవ్యయమును, దైవకార్యాచరణ కల్గించుచుండును. ఏదో విధముగా ధనము చేతికి అందుచున్ననూ వ్యయము అగుచుండును. శని జూన్ వరకు లాభమందు ఉన్ననూ దుర్వార్తలు కల్గించుచూ మనోభీతిని, శ్రమ, త్రిప్పట, స్థిరవృద్ధి కల్గించుచుండును. జూన్ తర్వాత వ్యయమందు వృధా వ్యయమును, అగౌరవమును అస్థిమితమును సూచించునదైననూ గురుని కలయికచే సమర్ధముగా ప్రతిపని యందు ముందదుగు వేయుచుందురు. నూతన యాంత్రిక వ్యాపార నిర్మాణములు చేయుచుందురు. ఏలినాటిశని ప్రారంభము ఛాయా గ్రహముల కేంద్ర స్థితి వలన దగ్గర బంధు వ్యయములు, మిత్రవైరములు, పట్టిన దంతయు బంగారమువలె ఊహ. స్థానచలనము మొదలగు ఫలితములు ఉండును. గోసేవ చేసినా, రుద్ర పారాయణలు చేయించినా అశాంతి దుర్వ్యయములు తొలగును.

వీరు కుటుంబ బాధ్యతలు మోయుట, వ్యాపార గణాంక శాస్త్రములందు సమర్దులుగా గుర్తింపు. సుందరదేహఛాయ, సుకుమారత్వము, వ్యాపారవృత్తులందు సమయానుకూల సమర్థులు. కొంచెం నాస్తికత్వమును కూడా ప్రదర్శింతురు. ఎవరేమి చెప్పినా కాదనలేరు. పరస్త్రీలద్వారా దూష్యములుండవచ్చును.

విద్యార్థులకు సంవత్సర పూర్వార్థముమేలు. ఇంజనీరింగ్, వైద్య, సాంకేతిక, విద్యార్థులకు అభివృద్ధి శూన్యము. భాషేతర, గణితము విద్యార్థులకు కొంత ఉత్సాహము, అభివృద్ధి కల్గును. సుబ్రహ్మణ్య అభిషేకములు, రాహు గురు జపములు చేయించుటద్వారా, సరస్వతి యంత్రము ధరించుట ద్వారా మరుపు, బద్ధకము తొలగి విద్యాభివృద్ధికల్గును. వ్యవసాయదారులకు పరీక్షాకాలము, వ్యాపారులకు నిలువలు, జాయింట్లు అనుకూలము కావు. అన్నిరంగముల వ్యాపారులకు పెట్టుబడులుతగ్గించి విదావించుటమేలు. కిరాణా, కలప, మిర్చి, ఫ్యాన్సీ, దినకృత్యవ్యాపారులకు పై అధికారుల ఒత్తిడులు కల్గుచున్ననూ విశేష లాభములను, స్థిరాస్తులను పొందుదురు. కోళ్ళు, మత్స్య, రైస్ మిల్లర్లు, అపరములు వ్యాపారులకు

5,6,7,11,12,3 నెలలు కాక మిగిలిన మాసములు లాభదాయకములు. కాంట్రాక్టర్లు, షేర్లువ్యాపారులకు బాగా కలిసివచ్చును. వైద్యులు న్యాయవాదవృత్తులు, సినీ, ఆర్థిక, వ్యాపారులకు 4,9,10,11,2,3 నెలలు విశేష ఫలితములు, గుర్తింపులు ప్రశంసలు నొందగలరు. ఉద్యోగస్థులు క్రిందివారివలన, పై అధికారులవలన ఇబ్బందులెదుర్కొనవలసి వచ్చును.

4,5 మాసములందు కార్యదీక్ష, దైవక్షేత్ర సందర్శనం, ధనార్జన, మితభాషణము, స్థిరలాభము, సౌఖ్యము, పౌరుషము, గుణవంతత.

6,7 మాసములందు స్వల్ప అనారోగ్యము, ఉష్ణతత్వము, కార్య విఘ్నము, వస్తు లాభము, సద్వ్యయము, స్వల్ప పరాపేక్ష, వాక్పటుత్వము

8,9 మాసములందు కుటుంబ సౌఖ్యము, ధాతృత్వము, స్థానచలనము, యౌవ్వనభోగము, ఆలోచనలు, ఉదరము, నడుము సంబంధ, ముఖసంబంధ, ఆరోగ్యలోపములు, చర్మరోగములు, ధనలాభము, భూమిమార్పులు.

10,11 మాసములందు ఉత్సాహము, గౌరవము, ధైర్య పరాక్రమములు, నూతన విద్యా మంత్రాభిలాషణములు. పిల్లల గురించి ఆలోచన, ప్రథమసంతానమునకు స్వల్ప అనారోగ్యము మిగిలిన మాసములందు ఏదో ఒక రంగమునకై ధన వ్యయము, బంధుమిత్రసహకారముతో సుసంపన్న కార్యానుకూల్యత. ఆర్థిక చిక్కులు, ప్రయాణములు, గృహనిర్మాణాది ప్రయత్నములు, శుభకార్య సిద్ధి శుభఫలితములు.

మృగశిరవారు పగడము, పుష్యరాగము - ఆర్ద్రవారు గోమేధికము, తెలుపు పుష్యరాగము - పునర్వసువారు ఎమరాల్డ్, పుష్యరాగము ధరించుట అత్యుత్తమము.

మొత్తం మీద ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 5. 1,3,6,9 తేదీలు సంఖ్యలు ఆది, సోమ, బుధవారములు యోగ్యప్రదములు. దుర్గాస్తోత్రపఠనము, రుద్రపారాయణలు, చేయుచుండుట సర్వదా ఆనందదాయకము. సంపూర్ణ నవగ్రహ స్తోత్రములు, మృత్యుంజయ జపశాంతులు. శనీశ్వరునికి తైలాభిషేకములుచేయించుట చాలాలాభం.

## కర్కాటకరాశి

(పునర్వసు 4వ పాదము, పుష్యమి 1,2,3,4 పాదములు, ఆశ్లేష 1,2,3,4 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 8 రాజపూజ్యం: 5 అవమానం: 4

ఈ రాశివార్కి గురుడు ఉగాదినుండి జూన్ 2 వరకు 10ట రజిత మూర్తి. తదాది వత్సరమంతయు 11ట సువర్ణమూర్తి. శని జూన్ 6 వరకూ 10ట తదాది వత్సరమంతయు 11ట సువర్ణమూర్తి. జూలై వరకు రాహువు జన్మమందు కేతువు 7ట, జూలైనెల తరువాత రాహువు వ్యయమందు, కేతువు 6ట సువర్ణమూర్తులు.

ఈరాశివార్కి షష్ఠ భాగ్యాధిపతి, నైసర్గిక శుభుడు, గురుడు రాజ్యమందు తరువాత లాభమందు పూర్ణయోగ్యప్రదుడు. మూర్తి మంతమురీత్యా యోగ్యప్రదుడు. ఉన్నత విద్యా, అధికారలాభములు, శుభకార్యనిర్వహణ, భూగృహ నిర్మాణములను, దూర యత్న ప్రయాణాదులను కల్గించును. లక్ష్మీవృద్ధిని, కుటుంబవృద్ధిని, ఉన్నతాధికార బంధుమిత్రలాభములను కల్గించును. దశమ శని దురాచారములను ఆలోచనలను, కొద్దిపాటి అగౌరవములను కల్గించును. నీచకార్యములు చేయుట యందు దృష్టిని మళ్ళించుచుండినమా శుభ గురుని కలయికచే దైవ కార్యాచరణములు, ఉన్నత విద్యా ఉద్యోగ లాభములు కల్గించును. దగ్గర బంధువ్యయము ద్వారా మనోఅశాంతిని, భాగ్యస్థిరత్వమును, ఆడంబరములరీత్యా వ్యయము కల్గించును. గత సంవత్సరమందలి ఛాయాగ్రహముల దోషము తొలగుటచే చేయుకార్యములందు నిమఘ్నత, సుసంపన్న కార్యజయము విజయము కల్గించును. ఉదరము, కంఠము సంబంధనొప్పులు అజీర్ణ వాత తత్వ కఫము, ఆరోగ్యలోపములనిచ్చును.

ఈ రాశివారు శాంతము మృదుతత్వముగలవారుగను సంఘమునందు ఉన్నతవ్యక్తులుగ ఆదరింపబడుదురు. ప్రజోపకరమైన కార్యములాచరించుచుందురు. స్వలాభము నెరుగరనుటలో వీరే సాటి. విద్యార్థులు ఉన్నత ర్యాంకుల్లో ఉత్తీర్ణులు కాగలరు.

భాషావిద్యార్థులకు శ్రద్ధ అవసరము. ఉద్యోగులకు, డాక్టర్లు, న్యాయవాద వృత్తుల, సినీ, నట గాయకులకు సంవత్సర ఉత్తరార్ధము బాగా కలసివచ్చును. వ్యవసాయదారులకు రెండవ పైరుపంటలు కలసివచ్చును. కిరాణా, తైల వస్త్రముల, రసాయన, వ్యాపారులకు, రైస్‌మిల్లర్లకు 4,5,7,9,10,11,1,3 మాసములు విశేషముగా కలసి వచ్చును. స్వయంవృత్తులవారికి సంవత్సర మధ్యమందు రాణించగలకాలము.

4,5 నెలలందు స్థిరములకు రాణించును. ఉత్సాహము మొండిబలము కల్గును. స్త్రీమూల వివాదములు, స్వల్ప ఆరోగ్యలోపములు ఇతరుల వ్యవహారముకై తిరుగుట మొIIలగు లక్షణములు ఉండును.

6,7 నెలలందు ఆరోగ్యవృద్ధి, స్వల్ప ధనప్రాప్తి, శ్రమకు తగ్గ ఫలితము.

8,9 నెలలందు మానసిక అశాంతి, ఇతర వ్యాపారములకై ఆలోచనలు ఆశాభంగము మొత్తంమీద మంచిఫలితములు.

10,11 మాసములందు మృష్టాన్న భోజనము, వ్యాపార లాభములు, దైవభక్తి, శ్రమ, త్రిప్పట.

12,1 నెలలందు శ్రమ, స్వల్ప లాభములు, వివాహ భూగృహ లాభములు, నూతన కార్యాభిలాషణము, సోదరవర్గ అభిమానము మిగిలిన మాసములందు, దుష్టభాషణము, ఇతరులను అప్పుఅడుగుట, శుభకార్యసిద్ధి, జపతప సమారాధనలు.

పునర్వసువారు ముత్యం, పుష్యరాగములను - పుష్యమివారు నీలము, పుష్యరాగం - ఆశ్లేషవారు పచ్చ, వజ్రము ధరించిన మేలగును.

మొత్తము మీద ఈరాశివారికి గతసంవత్సరము నుండి నిల్చిన వ్యవహారములు ఋణములు తగ్గును.

వీరుమృత్యుంజయ జపములు, రుద్రాభిషేకములు, సోమ, మంగళవార నియమములు, సుందరకాండ పారాయణ, దక్షిణామూర్తి ఆరాధన చేసిన సత్ఫలితమును ఇచ్చును.

వీరికి అదృష్ట సంఖ్య 2. 1,3,6,9 సంఖ్యలు ఆది, గురు, శుక్రవారములు కలసిన విశేష ఫలితము. స్త్రీలు ఆది, శుక్రవార నియమములు చేయుచున్న భర్త పితృసౌఖ్యము, ప్రశాంతత, ధనవృద్ధి కల్గును.

## సింహరాశి

### (మఖ 1,2,3,4 పుబ్బ 1,2,3,4 ఉత్తర 1వ పాదము)

ఆదాయం: 14 వ్యయం: 2 రాజపూజ్యం: 1 అవమానం: 7

ఈ రాశివారికి గురుడు జూన్ 2 వరకు 9ట రజితమూర్తి తదాది సంవత్సరమంతయు 10ట తామ్రమూర్తి. శని జూన్ 6 వరకు 9ట రజితమూర్తి తదాది వత్సరమంతయు 10ట లోహమూర్తి. జూలై 30 వరకు రాహువు 12ట కేతువు 6ట తామ్రమూర్తులు తరువాత వత్సరమంతయు రాహువు 11ట కేతువు 5ట లోహమూర్తులు.

వీరికి వత్సరమంతయు గురుబలం బాగున్నది, ఆగష్టునుండి రాహుబలం బాగున్నది. వీరికి గతముకంటె మంచి రోజులు, భూగృహనిర్మాణ లాభములు, సేవకలాభము, ఘనత, ధర్మకార్యసిద్ధి, నిరతాన్నదానము, కుటుంబమందు స్వల్ప ఆరోగ్యలోపములు. ధైర్య, ఉత్సాహ జీవనము, అన్నియు సమానముగా వహించుట, పరోపకారము, స్వల్ప అపకీర్తి, కార్యదక్షత మొదలగు ఫలితములు ఉండును. గురు బలముచే విద్యావ్యాసంగములు, ధర్మకార్యసిద్ధి, నూతన వ్యాపారములు, నిర్మాణములకు మంచికాలము, విద్యార్థులకు రాణించును. ఆంగ్లము, ఇంజనీరింగ్, గణితము విద్యార్థులకు అధిక శ్రమ అవసరము, ఉపాధ్యాయులు, వైద్యులు ఇతర ఉద్యోగులు నిదానించిన పరిస్థితులను తట్టుకొని ప్రశంసలను పొందుదురు.

వ్యవసాయ దారులకు మంచికాలము, జాయింటుదారులు, కాంట్రాక్టర్లు భారీ వ్యాపారులకు బాగా కలసివచ్చును. సొమ్ములు ఆలస్యంగా చేతికి అందును. అపరములు, మిర్చి, కలప, కిరాణా వ్యాపారులకు 5,7,8,12, 1 మాసములు విశేషముగా కలసి వచ్చును. యంత్ర, వాహన వ్యాపారులకు రైస్ మిల్లర్లకు వత్సర మధ్యమందు ఇబ్బందులు కల్గినా ఫలితము అనుకూలము.

సినీ, ఫైనాన్స్, వస్త్ర, షేర్లు వ్యాపారులకు 5,6,7,9,10,11,3 మాసములు విశేషముగా కలసివచ్చును. దీర్ఘకాలిక నిలవలు నిదానించిన కలసివచ్చును. రాజకీయము యోగించును.

4,5 మాసములందు ధనవృద్ధి, సత్సాంగత్యము, అధికార ఒత్తిడులు, దైవకార్యాచరణ.

6,7 మాసములు యత్నభంగము, కొద్దివ్యాపారులకు విశేష లాభము మెప్పుపొందుట, కుటుంబ ఆనందము గతముకంటె బాగుండును.

8,9 మాసములందు కార్యాటంకములు, మానసిక దడ, భావుక సోదరరీత్యావైరము. స్వల్పవ్యవహారజయము. పోగొట్టుకొన్న సొమ్ము తిరిగి సంపాదించుకొనుట, భోగము, స్త్రీ సౌఖ్యము

10,11 మాసములందు మానసిక అనుత్సాహము, పట్టుదలతో కార్యసాధన దుర్వార్తా శ్రవణము. తాపత్రయము, బహుధన సంపాదన, ఆత్మీయధనలాభము.

12,1 నెలలలో ధనలబ్ధి, సోదరప్రేమే కాని వ్యతిరేకత, కొద్దిపాటి వైరము, స్థిర లాభములు, పుత్ర సంతాన లాభము, నిదానించిన కార్యానుకూలత.

మిగిలిన మాసములందు నడుముబాధ, ప్రయాణవాంఛ ప్రారంభమున వ్యయము తర్వాత లాభము, ఆర్థిక, కుటుంబ, ఈతిబాధలు మొత్తంమీద బాగుగానే ఉండును.

మొత్తంమీద ఈరాశివారికి కుజ కేతువుల ప్రభావముచే ఆత్మసోధన, సంతాన అనారోగ్యములు, లేకితనము, ఉండుటచే అంగారక, కేతువు రవి గ్రహముల జపములు ఆచరించుట మంచిది.

అన్నిరంగముల వృత్తులవారికి ఉత్సాహవంతమైన ధనప్రదమైన, గౌరవప్రదమైన కాలమే. ముత్యము, గోమేధికము వెండితో తాపడం చేయించి ధరించుట మంచిది.

వీరి అదృష్ట సంఖ్య 1. 3,4,5,6,9 తేదీలు సంఖ్యలు ఆదివారములు యోగప్రదము, మఖవారు కృష్ణవైఢూర్యము, పగడము ధరించి మంగళవారములు దుర్గా ఆంజనేయ అంగారక స్తోత్రములు చేసిన విశేషము. పుబ్బవారు వజ్రము, పచ్చ ధరించిన, శుక్రవారములు చేసిన ధనప్రదము. ఉత్తరవారు కెంపు, పుష్యరాగము ధరించి ఆదివారములుచేసిన, సూర్యనమస్కారములు, సుబ్రహ్మణ్య, లలితా పూజలు చేసిన లక్ష్మీప్రదము. వీరు రవి, శని, కుజరాహు గ్రహములకు జపములు, ఈశ్వర, శనీశ్వర తైలాభిషేకములు చేసిన కార్యసిద్ధిని, ఆరోగ్యవృద్ధిని శుభకార్యసిద్ధిని పొందగలరు. స్త్రీలు గురు, శుక్రవార నియమములు శ్రీకృష్ణ, సాయి, లక్ష్మిస్తోత్రములు చేసిన అన్నింట ముందంజలో ఉందురు.

## కన్యారాశి

### (ఉత్తర 2,3,4 పాదములు, హస్త 1,2,3,4 పాదములు, చిత్త 1,2 పాదములు)

ఆదాయం: 2 వ్యయం: 11      రాజపూజ్యం: 4 అవమానం: 7

ఈ రాశివార్కి గురుడు జూన్ 2 వరకు 8ట సువర్ణమూర్తి తదాది వత్సరమంతయు 9ట రజితమూర్తి. శని, జూన్ 6 వరకు 8ట తర్వాతవత్సరమంతయు 9ట సువర్ణమూర్తులు. జూలై 30 వరకు రాహువు 11ట కేతువు 5ట రజితమూర్తులు తర్వాత వత్సరమంతయు రాహువు 10ట కేతువు 4ట సువర్ణమూర్తులు.

ఈ రాశివారికి జూన్ నుండి భాగ్యగురునిచే గతమునందు అనుభవించిన కుటుంబ, ఆర్థిక వ్యాపార వ్యవహారములందు గట్టెక్కి ఉత్సాహవంతంగా అభివృద్ధిపదములో నడుచుదురు. ఔషధసేవలు అనారోగ్యములు, పిత్రార్జిత వ్యయము తగ్గును. దాసదాసీ లాభము, దైవబ్రాహ్మణభక్తి, ధర్మకార్యసిద్ధి, గృహలాభము కల్గును. శని ప్రభావముచే, రాహు ప్రభావముచే కుటిలబుద్ధి అప్పుడప్పుడు కోప స్వభావము, బంధువైరము చేయువృత్తియందు ఆసక్తి తక్కువగా ఉండును. శక్తికిమించిన కార్యములు ఆచరింతురు. చర్మ, గుల్మరోగములు కంఠము, పిక్కలు మొదలగు స్థానములందు ఆరోగ్యలోపములు తరచు సూచించుచుండును. వ్యాపారస్థులకు జూలై తర్వాత విశేషము. ఆకస్మిక తగాదాలు, అపోహలు, గృహము

గురించిన అనుమానములు తగ్గించవలెను. వ్యవసాయదారులకు అన్నివిధముల మంచికాలము. చెరువులు, మత్స్య, కోళ్ళ పరిశ్రమలవారికి ఫలితములు వ్యత్యాసముగవుండును. ఆంగ్లము, గణితము, సాంకేతిక విద్యార్థులకు కృషిచేసిన ఉన్నతినొందగలరు. వైద్య, భాషేతర విద్యార్థులకు ఆటంకము లెదురగుచుండును. జూలై ప్రాంతము నూతన ఉగాది ప్రాంతములందు యత్నబదిలీలు, నూతన ఉద్యోగ లాభములు నొందగలరు. నూతన వ్యాపారులకు ప్రోత్సాహకరమైన కాలము. జాయింటులు, స్పెక్యులేషన్లు, కలసివచ్చును. కంట్రాక్టులకు ఊహకు పరీక్షాకాలము.

చైత్ర వైశాఖములందు అష్టమకుజాదిగ్రహముల సంచారముచే అన్నియు ఆటంకములుగను, అస్థిమితముగను ఫలసూచనలు, మిశ్రమధనలబ్ధి, శ్రమ నిదానముకల్గిన శుభము కల్గును. జ్యేష్ఠ ఆషాఢములందు భాగ్య రాజ్య స్థానములందు గ్రహముల ప్రభావముచే పాండిత్యగోష్ఠి, సభా, సన్మానములు, తొందరబాటుతనము. శుభసూచనలు, ప్రయాణ వ్యాపార లాభములు. నూతన వ్యాపారములు, నిత్యకృత్య వ్యాపారులకు అధికలాభములు. శ్రావణ భాద్రపదములందు స్వల్ప ఆటంకములు స్వర్ణమణిరత్న భూగృహ నిర్మాణ లాభములు. శుభసందర్శనలు, ఆర్థికవృద్ధి, స్త్రీ సౌఖ్యము, భోజన సౌఖ్యము, భూమిసంబంధ వ్యవహారములు, నూతన పరిశోధనలు, చేయుకృషియందు బద్ధకము, డాంబికము. ఆశ్వయుజ కార్తీకములందు నూతన బంధుమిత్ర స్నేహములు. అలంకారవస్తు వాహన లాభములు, నటగాయకులు, కవులకు ఆదరణ హెచ్చు. ప్రభుత్వ ఆర్థిక చేయూత, ఆకస్మిక ప్రయాణములు, కొద్దిపాటి మనస్థాపము. మార్గశిర పుష్యమాసములందు రవిగురు షష్టాష్ఠకముచే చేయువని యందు ఆందోళనలు, పునరాలోచనలు, ఔషధసేవలు. అయత్నబదిలీలు మనోఅశాంతి, వ్యాపారులందు, ప్రభుత్వమందు ప్రజావ్యతిరేకత, వ్యాపారనిలబాటు. మాఘ ఫాల్గుణమాసములందు వ్యాపార వ్యవహార అనుత్సాహము, స్వకీయ వ్యతిరేకత, అధికార వత్తిడులు, ఏదోవిధముగ స్వల్ప ఆదాయము, అధిక వ్యయము సూచించును.

ఉత్తర వారు కెంపు, పుష్యరాగము - హస్తవారు కెంపు, నీలమణి - చిత్తవారు పగడము, నీలము ధరించిన మేలగును. మొత్తము మీద ఈ రాశివారికి యోగప్రదమయిన కాలమనే చెప్పవచ్చు. సుబ్రహ్మణ్య అభిషేకములు కుజ, రాహుకేతు శుక్ర గ్రహ జపములుచేయించుట, దుర్గా, విష్ణు సహస్రనామపారాయణలుచేయుట, శుక్ర, గురువార నియమములు సల్పిన శుభముకల్గును.

వీరి అదృష్ట సంఖ్య 5. 1,3,6 తేదీలు సంఖ్యలు సోమ, బుధ, గురు, శుక్రవారములు కలసివచ్చును.

## తులారాశి

### (చిత్త 3,4 పాదములు, స్వాతి 1,2,3,4 పాదములు, విశాఖ 1,2,3 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 11 రాజపూజ్యం: 7 అవమానం: 7

ఈ రాశివారికి గురుడు జూన్ 2 వరకు 7ట, తదాదివత్సర మంతయు 8ట లోహమూర్తి. శని జూన్ 6 వరకు 7ట, తదాది 8ట తామ్రమూర్తి. జూలై 30 వరకు రాహువు 10ట కేతువు 4ట లోహమూర్తులు, తదాదివత్సరమంతయు రాహువు 9ట, కేతువు 3ట తామ్రమూర్తులు.

ఈ గ్రహములు నైసర్గిక శుభ పాపత్వములచేతను, స్థానాధిపత్యముచేతను స్థానము ననుసరించి మిశ్రమ ఫలితములు కల్గించును. జూలై తరువాత ఛాయాగ్రహముల మార్పుచేత కొంత అస్థిమితము, వ్యవహార నిలుపుదల, కార్యాటంకములు, అనాసక్తి తొలగును అంగారక సంచారము మిశ్రమముగవున్నది. నిర్మాణాదులు శ్రమమీద, అధిక ధన వ్యయముతో పూర్తిచేయుదురు. సంవత్సర మధ్యమందు కాలసర్పయోగములు, శని గురుల వక్రముచేత నూతన కార్యములు నిలుపుదల చేయుటమంచిది. ప్రయాణములందు జాగ్రత్త, విరమణ అత్యుత్తమము. శుభములు నిశ్చయించినా సంవత్సరాంతమున జరిపించిన భవిష్యత్తు బంగారుబాటే అగును.

వ్యవసాయదారులకు ఉత్తమ ఫలితములు, వ్యాపారులకు జాయింట్లు, నిలువదారులకు అధికార వాతావరణ వత్తిడులు, స్వల్ప లాభ వ్యయములు కల్గును. విద్యార్థులకు శ్రమచేసిన మంచికాలమే అగును. కిరాణా, యంత్ర, ఫ్యాన్సీ, రసాయన,

వ్యాపారులకు 4,5,6,11,12, 2,3 మాసములుకాక మిగిలిన మాసములు కలసివచ్చును. రైస్‌మిల్లర్లు, న్యాయవాదవృత్తి సినీ చిత్ర పరిశ్రమ, ఫైనాన్స్, చెరువులు వ్యాపారులకు 6,8,9,12,3 మాసములు యోగించవు.

చైత్ర వైశాఖములందు దైవకార్యములు ఆచరించుట ఉత్తమము. నీచస్త్రీ వైరము, కుబుద్ధి, నూతన స్నేహములు, ఆనందము, జ్యేష్ఠ ఆషాఢములందు అకస్మిక తనిఖీలు, పరీక్షాకాలము, వృధా వ్యయ ప్రయాసలు, ఆశాభంగము, వ్యవహారనిలుపుదల మాందీబలముకల్గును. శతృమిత్రత్వములు, మిత్ర శత్రుత్వములు కల్గుచుండును. శ్రావణ భాద్ర పదములందు వ్యవహార లాభం. మనోశాంతి, అపూర్వ వస్తు సంగ్రహణ, తీరికలేకుండుట, సన్మాన గౌరవములు, దాసదాసీ సుఖము, అన్నిరకముల లాభము. ఆశ్వయుజమందు నేత్ర అనారోగ్యము శత్రుపీడ, మనశ్చాంచల్యం, గోధన వాహన లాభము. ఇతరులకు అన్యాయము తలబెట్టుట, కార్తీకమందు బుధ శుక్ర సంచారముచే గ్రహబాధలు తొలగుట, లేఖనము, శ్రేష్ఠబుద్ధి, సుందరదేహచ్ఛాయ, వాక్పటుత్వము, బహుబలయుక్తము. మార్గశిరమందు పరిశుభ్రత, విల్వధన వ్యయము, వ్యాపార పెట్టుబడులు చికాకు, ఆదరణ తక్కువగుట. ఆకస్మిక ధనలాభము, పశులాభము. పుష్యమాసము పరరక్షణాసక్తత, పితృమూలక స్థిరవివాదము, పరులచే ఈర్ష్య, వాక్పౌరుషము తగ్గించుటమేలు. నేత్ర, లింగసూచిత స్థావ ఆరోగ్యలోపము, చికిత్సలు. మిగిలిన మాసములందు ఆర్థిక అస్థిమితము వుంటుంది. చేయుపనియందు విదావమవసరము, అన్నియుబాగుండును.

చిత్తవారు పగడము నీలము ధరించవలెను. శనివారములు చేయవలెను. స్వాతివారు గోమేధికము, ముత్యముధరించిన సోమవారములు చంద్రశేఖరాష్టకములు చేసిన ఉత్సాహము. విశాఖవారు ముత్యము, కనక పుష్య రాగము ధరించవలెను. గురువారములు హయగ్రీవ స్తోత్రములు చేయవలెను.

మొత్తం మీద ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 6. 1,4,5,9,8 తేదీలు సంఖ్యలు యోగ్యప్రదములు. సంపూర్ణ నవగ్రహ జపము, మృత్యుంజయ జపములు రుద్రాభిషేకములు చేయించుటచే ప్రశాంతత, ముందంజ, శుభ కార్య ఫలసూచనకల్గును. సోమ, శనివారములుచేసిన శ్రీవేంకటేశ్వర, శనీశ్వర, లలితాపారాయణలుచేసిన అత్యుత్తమ ఫలప్రదము.

స్త్రీలు, సోమ, మంగళవారములు ఆచరించిన లలితా, గణేశ్వర, ఆంజనేయ సుబ్రహ్మణ్య పూజలు చేయుచుండిన గృహమందు స్థిరలక్ష్మి కుటుంబ ఆనందము, సంతాన వృద్ధి కల్గును. ఋణవిముక్తి కల్గును.

## వృశ్చికరాశి

### (విశాఖ 4వ పాదము, అనూరాధ 1,2,3,4 పాదములు, జ్యేష్ఠ 1,2,3,4 పాదములు)

**ఆదాయం: 5 వ్యయం: 5** **రాజపూజ్యం: 3 అవమానం: 3**

వీరికి శని జూన్ 6 వరకు 6ట, తదాదివత్సరమంతయు 7ట రజితమూర్తి. గురుడు జూన్ 2వరకు 6ట సువర్ణమూర్తి. తదాది వత్సరమంతయు 7ట రజితమూర్తి. జూలై 30 వరకు రాహువు 9ట, కేతువు 3ట తామ్ర మూర్తులు, తదాది వత్సరమంతయు రాహువు 8ట, కేతువు 2ట రజితమూర్తులు.

వీర్కి జూన్ తరువాత గురుడు చాలావరకు యోగకారకుడు, ఆర్థిక సమస్యలను నివారించును. శని మిశ్రమ ఫలితమునిచ్చును. ధైర్యము నిచ్చును. కళత్రవర్గ అనారోగ్యమును నరముల బలహీనతను నిచ్చును. స్థిరాస్తులు క్రమేణా బలపరచును. ఏదోవిధముగ ధనవ్యయము కల్గుచుండును. తరచు భయము మనోవ్యాకులత చెందుతూ వుంటారు. మంచిచెడులు సమానముగ వుంటాయి. అష్టమ రాహు బలముచే శుభ గురుని దృష్టిచే దూరదృష్టిచేత, విధానముచేత స్వల్పధన వ్యయముద్వారా సమస్యలు ఉత్పన్నత చెందవు. కొద్దిపాటి దూరదృష్టితో శుభాలకు వెలవు కాగలదు.

విద్యార్థులకు మిశ్రమ ఫలితములు, సాంకేతిక, ఇంజనీరింగు విద్యార్థులకు కొంతమేలు. జాయింటుదారులు, విల్వదారులకు తగ్గించుటమేలు. ఉద్యోగులకు, వైద్యులకు ప్రజాసమస్యలు అధికమగును. సినీ యంత్ర వ్యాపారులకు ఫైనాన్స్

వ్యాపారులకు మిశ్రమఫలితములు, కిరాణా, ఫ్యాన్సీ, ఆయిల్, వస్త్రవ్యాపారులకు విశేషలాభములు. నూతన యాంత్రిక వ్యాపార నిర్మాణము లాచరించిన ఆలశ్యముగ కలసివచ్చును. శుభకార్యములు నిదానించి ఆచరించుటమేలు.

చైత్ర వైశాఖములందు మౌనముమేలు. ఏదోవిధముగ ధనవ్యయము, మాటపట్టింపులు, అనారోగ్యసూచనలు. శుభములు అనుకూలించును. రవి శని ప్రభావముచే ప్రమోషన్లు అన్నివర్గము వారికి కల్గును. ఆకస్మిక దాడులుండును. జ్యేష్ఠ ఆషాడమాసములు ఉన్నతి, ఉత్సాహము, బంధుమిత్ర, సజ్జన సహవాసము, రాజయోగము, ధనలబ్ధి, శ్రావణమున పితృమూలక వివాదములు, స్వల్ప వ్యాపారలాభములు. స్త్రీలోలత్వము, జయము. భాద్రపదమున కార్యస్థాన బలములు, సాధన, వృత్తి ఉద్యోగాదులందు జయము, అభివృద్ధి, పెట్టుబడులు. ఆశ్వయుజ కార్తీకములందు యత్న బదిలీలు. అనుకూలవాతావరణములు. భూగృహనిర్మాణ శుభయోగములు. దుర్బుద్ధిరీత్యా ధనవ్యయము. సన్మాన గౌరవము. స్త్రీల వలన అశాంతి. మార్గశిర పుష్యములందు శరీర ఆరోగ్యప్రాప్తి, యత్నకార్యసిద్ధి, ఉత్తమ భోజనము, బంధుమిత్ర అనురాగము. మాఘ ఫాల్గుణములందు స్వయం కృషితో ధనలాభము. • స్త్రీరీత్యా ధనలాభము, తపోధర్మకార్యసిద్ధి, రాజాధికార ప్రాప్తి, ముందు అసౌఖ్యము తరువాత సుఖము, కుజ ప్రభావముచే భ్రాతృసౌఖ్యమేగానీ ద్వేషము, శస్త్ర చికిత్స ఔషధసేవలు, త్రిప్పట, బదిలీలు అనుకూలత.

విశాఖవారికి పుష్యరాగా భరణము, ముత్యము, సోమ, గురువారములుమేలు. అనూరాధవారికి నీలమణి పగడము ఉత్తమము, జ్యేష్ఠవారికి పచ్చకంటె పుష్యరాగముమేలు.

వీరి అదృష్ట సంఖ్య 9. 2,3,7,9 తేదీలు, సంఖ్యలు ఆది, సోమ, గురువారములు కలసిన మరింతయోగ ప్రదములు. శని గురు కేతు గ్రహములకు జపశాంతులు, శని, గురువార నియమములు ఆచరించిన ఉత్సాహము, అభివృద్ధి కల్గును.

స్త్రీలు, మంగళ, శుక్ర వారములు, దుర్గాపూజలు, సుబ్రహ్మణ్య, నవగ్రహ పూజలు, చేయుచుండిన కుటుంబమందు శాంతి, సంతానసౌఖ్యము, ఋణవిముక్తి భర్తృ సౌఖ్యము పొందగలరు.

## ధనూరాశి

(మూల 1,2,3,4 పాదములు, పూ.షా. 1,2,3,4 పాదములు, ఉ.షా. 1వ పాదము)

ఆదాయం: 8 వ్యయం: 11 రాజపూజ్యం: 6 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు జూన్ 2 వరకు 5ట లోహమూర్తి తరువాత వత్సర మంతయు 6ట సువర్ణమూర్తి. శని జూన్ 6 వరకు 5ట సువర్ణమూర్తి, తదాదివత్సరమంతయు 6ట లోహమూర్తి, జూలై 30 వరకు 8ట రాహువు 2ట కేతువు సువర్ణమూర్తులు, తదాదివత్సర మంతయు జన్మమందు కేతువు, 7ట రాహువు లోహమూర్తులు.

ఈ రాశివారు స్వతంత్రతగలవారు, ఇతరులకు ఆదర్శముగ వుండువారును. శుభాశుభ విచక్షణచేయువారును సూటిగమాట్లాడువారును తాము నష్టపోయినా ఇతరులకు లాభముచేకూర్చువారు అయివుందురు. ఈ సంవత్సరము గ్రహముల నైసర్గికత్వము, మూర్తిమంతముల నిర్ణయ ప్రకారము ఫలితములు మిశ్రమములగును. యుక్తితో ప్రతిపనియందు తామే అన్నట్లు కాక తప్పించుకొన్న ధన్యులగుదురు.

షష్ఠ గురుని ప్రభావముచే జూన్ తరువాత నడుము, మోకాళ్ళు, ఉదరము సంబంధ ఆరోగ్యలోపములు, మాతృవర్గ అనారోగ్యము, శత్రుజయము, నల్లనిజంతుభీతి మేనమామవర్గ అపబలము. ఏదోవిధముగ అభివృద్ధి గురించి ఋణములు చేయవలసివచ్చును. ఇతరులకు ధనము ఇచ్చిన వివాదమగు సూచనలున్నవి. ముఖాముఖీ వాక్పటుత్వము శత్రుచోర రాజనిర్భయత, పశువృద్ధి, నాస్తికత్వము, వితండవాదములు, స్థాన అనుమానములు, ప్రయాణములు, అనుమానములు కల్గుచుండును.

విద్యార్థులు అత్యధిక శ్రద్ధచూపినగాని ఉత్తీర్ణులుకాలేరు. ఆంగ్లము, న్యాయవాద, పట్టభద్రులకు అత్యున్నతకాలము, విశేష ఆదరణ, గుర్తింపుకుతగ్గ ఫలితములు కల్గును. మేధాశక్తి పదునుగ వుండును. వ్యాపారులకు మిశ్రమ ఫలితములు,

నిదానించి తక్కువ పెట్టుబడులుంచిన అధిక లాభములు పొందగలరు. నూతన వ్యాపారములు, జాయింట్లు, నిలువలు వలన మోసపోవలసివచ్చును. వ్యవసాయ దారులకు సమఫలితములు, కాంట్రాక్టర్లకు అనుకూలముకాదు.

చైత్ర, వైశాఖములందు గౌరవానికి సంబంధించిన సమస్యలు, మానసిక సంతృప్తి, సంతానవృద్ధి, పదోన్నతి, కళాకారులకు సన్మానములు, నిర్మాణములు, శుభములు కలసివచ్చును. రాజకీయం ఫలించును.

జ్యేష్ఠ, ఆషాఢములందు ఇంటా, బయటా సమస్యలు, అనుమానములు వాద ప్రతి వాదములు, విరక్తి ఇంకను మిశ్రమ ఫలితములు. వ్యవహారము నిలుపుదల కల్గును. సంఘ కార్యములందు మౌనము వహించుటమేలు.

శ్రావణ భాద్రపదములందు నూతన వ్యాపారం కలసివచ్చును. గతంలో నిలచిన భూ, వ్యాపారము ఫలించును. శుభములు సూచించును. ఉదర, నడుము, లింగ సూచకస్థానములందు చికిత్సలు, ఔషధసేవలు కల్గును.

ఆశ్వయుజ, కార్తీకములందు రవి, బుధ, శుక్ర సంచారముచే విద్యా ఉద్యోగ లాభములు. కవితా వ్యాసంగములు. మనో ఆనందము. ఉన్నత అధికార ఉద్యోగులతో మైత్రి, స్త్రీవాంఛ, భూ, స్వర్ణ వస్త్రాలంకారప్రాప్తి. మార్గశిర, పుష్యమాసములందు భోగలాలసము, స్థానచలనము, వాత పిత్త అనారోగ్యము, త్రిప్పట, స్త్రీ జనులయందు మనస్తాపము. ప్రతిపనియందు నిమగ్నత దైవకార్యాచరణ. రత్నవ్యాపారులకు, కిరాణా, కలప, వస్త్ర వ్యాపారులకు విశేషము.

మాఘ, ఫాల్గుణమాసములందు ఇంద్రపరాక్రములైనమా శత్రు, లోహ, వాహనరీత్యా భయము, తస్కరభీతి. నూతన ఋణములు, భూ, వ్యవహార తగువులు. ఛాయాగ్రహముల ప్రభావముచే మనోవ్యాకులత, దుష్టకోరికలు. వివాహాది శుభములందు [illegible] సూచించును.

మూల వారికి వైఢూర్యము, కనక పుష్యరాగాభరణము - పూర్వాషాఢవారికి పగడము - ఉత్తరాషాఢ వారికి కెంపు, పచ్చలు ధరించుట ఆనందదాయకము.

వీరి అదృష్ట సంఖ్య 3. 1,5,7,9 సంఖ్యలు, తేదీలతో ఆది, బుధ, గురువారములు కలసిన మరింత యోగదాయకములు.

మొత్తంమీద ఈ రాశివారు సుబ్రహ్మణ్య అభిషేకములు, కుజ గురు జపములు ఆచరించిన కుటుంబవృద్ధి కల్గును. సంపూర్ణ నవగ్రహ జపములు, సుబ్రహ్మణ్య దుర్గా రుద్ర సహస్రనామపారాయణ, గురువార నియమములు ఆచరించిన ఆరోగ్యమునకు, ధనమునకు మనశ్శాంతికి లోటురాదు.

స్త్రీలు గణపతి, లక్ష్మి, సాయి పూజలు ఆచరించిన గృహమందలి ఒడిదుడుకులు తొలగును.

## మకరరాశి

### (ఉత్తరాషాఢ 2,3,4 పాదములు, శ్రవణం 1,2,3,4 పాదములు, ధనిష్ఠ 1,2 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 2 అవమానం: 6

ఈ రాశి వార్కి జూన్ 2 వరకు గురుడు 4ట తదాదివత్సరమంతయు 5ట రజితమూర్తి. శని జూన్ 6 వరకు 4ట తదాదివత్సరమంతయు 5ట లోహమూర్తి, జూలై 30 వరకు రాహువు 7ట, కేతువు జన్మమందు రజిత మూర్తులు తర్వాత రాహువు 6ట, కేతువు 12ట తామ్రమూర్తులు.

ఈ రాశివార్కి గురుడు జూన్ వరకు అధిక ధనవ్యయాన్ని, పండిత స్నేహ ఆదరణ, గో, పశువృద్ధి, వివాహాది శుభకార్య వ్యయము, శరీరపీడ కల్గించును. జూన్ తర్వాత భోగము, గౌరవము, నేర్పరితనము కుటుంబ సహకారముతో కార్యజయము కల్గించును. సంతానమునకు కొద్దిపాటి అనారోగ్యాన్ని, చర్మవ్యాధులను కల్గించును. రాహుకేతువులు అప్పుడప్పుడు ధనలాభ వ్యయములను, మనశ్శాంచల్యమును ప్రయాణములను, భయమును, మనః క్లేశమును కల్గించుచుండును, మిత్ర శతృత్వము అల్పత్వము, తగనికోరికలు కల్గుట మొదలగు లక్షణములు కల్గుచున్ననూ కొద్దో గొప్పో శుభ గురుని దృష్టివలన ఉత్సాహ ఫలితములు కలుగవచ్చు.

విద్యార్థులకు అత్యధిక శ్రద్ధ ఉన్నకాని ఉత్తీర్ణులు కాలేరు. వైద్య, విజ్ఞాన సబ్జెక్టులు ఉత్సాహమును ఇచ్చును. ఉన్నతాధికారులు, ఉపాధ్యాయులు బ్యాంకర్లు కదు మెలకువతో వ్యవహరించుట మంచిది. వ్యాపారులు నిదానించి స్వల్ప పెట్టుబడులతో సాగించిన నష్టములు రావు. జాయింటుదార్లు, కాంట్రాక్టర్లకు, మొదట నష్టసూచనలు కల్గిననూ తరువాత లాభించును. షేర్లు, స్పెక్యులేషన్ లాభించును. అపరములు, కలప, చిత్రపరిశ్రమ, కోళ్ళఫారములు, మత్స్య, వస్త్ర, వ్యాపారులకు 4,6,9,10,11,1,3 మాసములందు లాభించును. స్వయంవృత్తివారు, వైద్యులు, కళాకారులకు వత్సర ఉత్తరార్ధము ఫలించును.

చైత్ర వైశాఖములందు స్వల్ప ఇబ్బందులు కల్గుచున్ననూ స్వయంకృషితో ధనలాభము, ఆనందము, అధికారమిత్ర సందర్శనము. కుటుంబమందు కొద్దిపాటి అస్థిమితము, అనారోగ్యము సూచించి మంచికల్గును.

జ్యేష్ఠ మాస ప్రాంతములందు సంతానసౌఖ్యము, భూ, రత్న మణి లాభములు, మనోప్రసన్నత సూచించును. ఆషాఢ ప్రాంతములందు వాదోపవాదములు, ఆర్థికలాభము. మాతృవర్గరీత్యా అననుకూలత.

శ్రావణ భాద్రపదములందు ప్రయాణ లాభములు, ఔషధసేవలు, శస్త్రచికిత్సలు, భూ, గృహ, వివాహ లాభములు కల్గును.

ఆశ్వయుజ కార్తీకములందు చేయుపనియందు సంతృప్తి, నూతన విద్యామంత్రాభిలాషణములు, నూతన వ్యాపారములు, అపూర్వ వస్తు సంగ్రహణము, దూర ప్రయాణములు, నూతన ఉద్యోగప్రాప్తి కల్గును.

మార్గశిర, పుష్యములందు వస్తు, అలంకార వస్త్రలాభము. వ్యవహార చికాకులు, ధనవృద్ధి. నీచస్త్రీవైరము.

మాఘ, ఫాల్గుణములందు ఆనందము, క్షీరాన్న భోజనం, శరీర ఆరోగ్య ప్రాప్తి, ఇంట శుభసందడి, విద్యా, వ్యాపార లాభములు.

ఉత్తరాషాఢవారు వజ్రము - శ్రవణంవారు ముత్యం, పచ్చ - ధనిష్ఠవారు పగడం, నీలం ధరించిన యత్నఫలసిద్ధి.

వీరి అదృష్ట సంఖ్య 8. 1,3,4,6,9 సంఖ్యలు, తేదీలు సోమ, మంగళ, శుక్రవారములు కలసిన మరింత లాభము. శివలింగ దర్శనములు, శని, కేతు జపములు, శనీశ్వర తైలాభిషేకములు. లక్ష్మీనారాయణుని ఆరాదించుట.

స్త్రీలు శని శుక్రవార నియమాలు, రాజరాజేశ్వరి, శివస్తోత్రపారాయణముచేత కుటుంబమందు సౌఖ్యము, ఆరోగ్యములు, ఋణవిముక్తికల్గును.

## కుంభరాశి

### (ధనిష్ఠ 3,4 పాదములు, శతభిషం 1,2,3,4 పాదములు, పూ.భా. 1,2,3 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 5 అవమానం: 6

ఈ రాశివార్కి గురుదు జూన్ 2 వరకు 3ట తదాదివత్సరమంతయు 4ట లోహమూర్తి శని, జూన్ 6 వరకు 3ట తదాదివత్సరమంతయు 4ట సువర్ణమూర్తి. జూలై 30 వరకు రాహువు 6ట కేతువు 12ట లోహమూర్తులు తదాదివత్సరమంతయు రాహువు 5ట కేతువు 11ట సువర్ణమూర్తులు.

వీరికి జూలై 30 తర్వాత కేతువు లాభస్థానమునకు ప్రవేశించుటచే గతములోని వ్యవహారచికాకులు, భీతి, అసుఖము మొదలగు చెడుఫలితములు తొలగి శుభము వృద్ధి, ధనలాభం కల్గును. మిగిలిన శని, గురు, రాహువుల ప్రభావముచే ధనము ఖర్చునకు లెక్కించరు. ఎంతటి ఘనకార్యమునైననూ బరువు మోయుచూ ముందుకుసాగుదురు. ప్రజారంగమున విశేష కార్యక్రమములు చేయుచుందురు. $\frac{1}{2}$అష్టమ శనివల్ల అప్పుడప్పుడు బంధువైరములు, ఉదర వ్యాధి, గృహవాహన మార్పులు, పూర్వ ధనవ్యయము చేయుచుందురు. గురుబలముచే నూతన కృష్యారంభములు, వృద్ధి, గృహ నిర్మాణాలు, కలసివచ్చును. విదేశీ ప్రయాణములు రాక స్వస్థాన ఉద్యోగములైననూ మేలే. స్వయం వృత్తులు కూడా భవిష్యత్తు బంగారు

బాటగా ఉండును. అన్నిరంగముల విద్యార్థులకు కొద్దికృషివల్ల ఉన్నతికల్గును. ఉపాధ్యాయ, ఇంజనీరింగ్, విద్యార్థులకు సదవకాశము. రసాయనిక, సిమెంటు, ఎరువులు, ధాన్యం వ్యాపారులకు సుమారుగా లాభము కలసివచ్చును.

చిత్రకళాకారులు, ఎక్స్‌పోర్ట్ వ్యాపారులకు, కిరాణా, ఫైనాన్స్ వ్యాపారులకు 3,4,5,9,10,2,3 మాసములు విశేషలాభములు. కాంట్రాక్టర్లు, జాయింటుదారులు, నిలువదారులకు ఆలస్యంమీద ఫలించును.

చైత్ర, వైశాఖములందు భూ, గృహ మార్పులు, ఇంటా బయటా సమస్యలు, అనుమానములు కలుగుచుండును. శుభకార్యములగురించి నిదానించవలెను.

జ్యేష్ఠ, ఆషాఢములందు శత్రువృద్ధి, ఔషధసేవలు, ధనలాభ వ్యయములు సూచించుచుండును. ఆకస్మిక బదిలీలు ఉండగలవు.

శ్రావణ, భాద్రపదములందు కుటుంబమందు అనారోగ్యము మాట పట్టుదలలు, విద్యార్థులకు ఆటంకములు కల్గుచుండును. తమకంటే చిన్నవారి సహకారం కోరవలసి వచ్చుచుండును.

ఆశ్వయుజ, కార్తీకములందు ఇతరులచే స్తుతింపబడుట, మానసిక ఆందోళన తొలగుట, ఉన్నతాధికార ఉద్యోగులతో మైత్రి, సంతాన సౌఖ్యం, కార్య విఘ్నములు వ్యవహారములందు స్వల్ప జయము.

మిగిలిన మాసములందు రాజకీయ వ్యవహారాలు కుజప్రభావంచే, స్వయంకృషి ధనలాభం, పరాక్రమము, మిశ్రమ ఫలితములు.

పూర్వాభాద్ర వారికి పుష్యరాగం, పగడం, శతతారవారికి గోమేధికం, ముత్యం.

ఈ రాశివారి అదృష్ట సంఖ్య **8.** 1,3,6,7,9 సంఖ్యలు, తేదీలు మంగళ, శుక్రవారములు కలిసిన యోగప్రదములు.

మొత్తంమీద ఈ రాశివారికి శుభకార్యనిర్వహణ, గృహనిర్మాణాది లాభములు, ఉద్యోగోన్నతి, వత్సరమధ్యమందు మాత్రము ఒడిదుడుకులు కలిగి నివారితమగును. స్త్రీలు గురు, శుక్రవారములు, సూర్యారాధన, సుబ్రహ్మణ్య అభిషేకములు ఆచరించిన కుటుంబమందు ఉత్సాహము, వృద్ధికల్గును.

## మీనరాశి

**(పూ.భా. 4వ పాదము, ఉ.భా. 1,2,3,4 పాదములు, రేవతి 1,2,3,4 పాదములు)**

ఆదాయం: 8 వ్యయం: 11 రాజపూజ్యం: 1 అవమానం: 2

ఈ రాశివార్కి జూన్ 2 వరకు గురుడు 2ట తామ్రమూర్తి తదాది వత్సరమంతయు 3ట సువర్ణమూర్తి. శని జూన్ 6 వరకు 2ట సువర్ణమూర్తి, తదాది వత్సరమంతయు 3ట రజితమూర్తి. రాహువు 5ట, కేతువు 11ట జూలై 30 వరకు తామ్రమూర్తులు. తదాదివత్సరమంతయు రాహువు 4ట, కేతువు 10ట రజితమూర్తులు.

ఈ రాశివార్కి శని జూన్ తర్వాత లాభవ్యయాదిపత్యం కల్గిన పూర్ణయోగ ప్రదుడని చెప్పవచ్చు. సత్యవాక్కు, కార్యసిద్ధి, కీర్తిగౌరవములను, స్వకీయబలములను కల్గించును. సోదర వర్గమును శత్రుత్వము నుండి దరిచేర్చును. గురుడు, రాహు కేతువులు పరిపూర్ణ పాపులు. తరచు ప్రయాణములు, దుర్వార్త శ్రవణములు, చేసినమేలు మరచుట, ఇతరులను తృణీకరించుట, కార్యముల తొందరపాటును స్వల్పగౌరవాధికారములను కల్గించును. తమతమ వృత్తులందు ఇతరులను అనుమానింతురు. తరచూ అనారోగ్యమును, కలహములను సూచించుచుండును. ఈ దేవ గురుడు నైసర్గిక శుభుడుగాన అపకారములను తొలగించగలడని భావించవలెను. కుజసంచారముచే వత్సర ఉత్తరార్ధమున భూ, గృహ ఉద్యోగాదులకై ధన భారము నెత్తినపడును.

ఆంగ్లము, వైద్య, న్యాయవాద విద్యార్థులకు అత్యధిక శ్రద్ధమీద ఫలించి ఉన్నతికల్గును. ఇంజనీరింగ్, గణితం, భాషేతర విద్యార్థులకు రెండవఛాన్సు ఆశించవచ్చు. వ్యాపారులు పెట్టుబడులు తగ్గించుటమేలు జలవ్యాపారులకు లోటుగావున్నది. కోళ్ళఫారములు, మిర్చి, తైలము, సిమెంటు, యాంత్రిక వ్యాపారులకు యోగప్రదము, అపరములు ఫ్యాన్సీ, కిరాణా ధాన్యము వ్యాపారులకు విశేషములేదు. ధాన్యము, పేపరు, కలప వ్యాపారులకు కళాకారులకు, స్వయం వృత్తులవార్కి

పరీక్షాకాలము, జాయింటులు, నిలువలు కలసిరావు. స్పెక్యులేషన్ యోగించదు. శాస్త్రవేత్తలకు ఇతోధిక సహాయము కల్గును. సన్మానములు, పురోభివృద్ధికల్గుచుండును.

చైత్ర వైశాఖములందు చంద్రగోచారముచే కొద్దిపాటి అస్థిమితములున్ననూ క్రమముగ సుఖ సంతోషములు కల్గుచుండును. శుభకార్య ప్రయత్నములు నిలుచును. భూమార్పులు కల్గుచుండును. వ్యాపార పెట్టుబడులకై ఆలోచనలు చేయుదురు. క్రయవిక్రయములందు లాభముచేకూరును. మౌనము, హుందాతనము పాటించుట ఉత్తమము. మాటపైనుండగలరు.

జ్యేష్ఠ ఆషాడములందు ప్రారంభమున ఆరోగ్యలోపములు సూచించినా తరువాత సర్దుబాటు కల్గును. కార్యసాధన, కృషిమూలకధన లాభము. వ్యాపారులకు ఎగుమతులు కలసివచ్చును. వ్యవహారములు నిలుపుదలచేయుట మంచిది. సినీ వృత్తులవార్కి గుర్తింపుగలకాలము. శ్రావణ, భాద్రపదములందు కుజప్రభావముచే పుత్రకళత్ర అనారోగ్యములు దుబారా ధన వ్యయములు జీర్ణరోగశమనము, సర్వదామనస్తాపము, లోకాపవాదము, అశాంతి, పత్నీ అసౌఖ్యము, గమనవాంఛలుకల్గును.

ఆశ్వయుజ కార్తీకములందు కుటుంబసమస్యలధికము. నడుముబాధ, బహువిధ చికాకులు, విలాసవంతము, దుష్ట భాషణము, ఋణ సమస్యలు, బుధ, శుక్ర ప్రభావముచే శతాయువు, విదేశ ఖ్యాతి, వ్యవసాయ వ్యాపార లాభములు కల్గును.

మార్గశిర పుష్యమాసములందు కుజగురు సంచారముచే వివాహ శుభములురీత్యా వ్యాపారరీత్యా ప్రయాణములు, అశాంతి, అపవాదము. శస్త్రబాధ, శత్రుభీతి కల్గుచుండును. వ్యవసాయదారులకు అనువైన లాభములుండును. ఉద్యోగులకు అధికార వత్తిడులు, మాఘఫాల్గుణములందు వ్యాపారములు బంధుమిత్రులదగ్గర మౌనము వహించుటమేలు. బాకీలు వసూలగును. మాతనకొనుగోళ్ళయందు భారము అధికమగును. ప్రయాణములు కలసివచ్చును.

మొత్తంమీద ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 3. 2,5,8,9 సంఖ్యలు, తేదీలు కలసివచ్చును. ఆదిత్య సోమ, బుధ, శనివారములు కలసివచ్చును.

ఈ రాశివారు గురు చంద్ర రాహు కేతువులకు జపములు రుద్రాభిషేకములు, దుర్గా సుబ్రహ్మణ్య జపాభిషేకములు, సంపూర్ణ నవగ్రహ శాంతులాచరించవలెను. పగడము, ముత్యము ధరించిన ప్రశాంతత, ఆరోగ్యవృద్ధి, కుటుంబ వృద్ధికల్గును. అశాంతి తొలగును.

స్త్రీలు గురువారములు, మంగళవారములు సాయిపూజలు, శివ ఆంజనేయ సహస్రములు, దుర్గాపారాయణ చేయుటద్వారా గృహమందు శాంతి ఆరోగ్యములు కల్గును. ఆర్థికవృద్ధి, భర్తృపుత్ర సౌఖ్యములుకల్గును.

* * *

శ్లో॥ సర్వజ్ఞః సకలామరార్చితపదస్సప్తాచలాధీశ్వరః
సర్వాభీష్ట ఫలప్రదాన నిపుణః శశ్వత్ప్రసన్నాననః ।
వేదాన్తైరనుమేయ సుందరవపు ర్మోహాభిగమ్యస్సదా
కళ్యాణం భవతాం కరోతు భగవాన్పద్మావతీ వల్లభః ॥

వేదాన్తం దేశికాచార్యః,
తి.తి.దే. ఆస్థాన పణ్డితః.

## శుభముహూర్తముల సందర్భము

ఇందు బాహుళ్యముగ శుభముహూర్తములను నిర్ణయించి వ్రాసితిని. ఇందు వ్రాయబడిన వానికి స్వల్ప దోషములున్నను వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహా దోషములు, ఉపదోషములు, మీన చైత్ర, లత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3,4, గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు వ్రాయుటయుగలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగా గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను. -- పంచాంగకర్త.

## శుభముహూర్తాని

### చైత్ర మాసము (5-4-2000 నుండి 4-5-2000 వరకు)

ఏప్రిల్ 14 శుక్ర. ఏకాదశి. మఖ. వివాహస్య వృశ్చికోమతాంర. రా.గం. 9-6.

16 ఆది. త్రయోదశి. ఉత్తర. డోలారోహణక్రయ విక్రయాదీనాం సింహోరాజా ప.గం. 3-32. వివాహ గర్భాధానగృహప్రవేశాదీనాం వృశ్చికోర రా.గం. 8-57. వివాహగృహప్రవేశాదీనాం ధనూర రా.గం. 12-6.

19 బుధ. బ.పాడ్యమి. స్వాతి. అన్నప్రాశన వివాహ గృహారంభ వ్యాపారాదీనాం మిధునం ర ఉ.గం. 11-09 వ్యాపారాదీనాం సింహో ర ప.గం. 3-29. వివాహస్య ధనూర రా.గం. 11-57.

21 శుక్ర. తదియ. అనూరాధ. నూతన వ్యాపారాదీనాం సింహో మతాం ర ప.గం. 3-12. గర్భాధాన గృహప్రవేశాదీనాం వృశ్చికో ర రా.గం. 8-39. వివాహ గృహప్రవేశాదీనాం కుంభోర రా.గం. 3-39.

23 ఆది. పంచమి. మూల. డోలారోహణస్య సింహోర ప.గం. 3-04.

### వైశాఖ మాసము (5-5-2000 నుండి 2-6-2000 వరకు)

మే 10 బుధ. సప్తమి. పుష్యమి. అన్నప్రాశనస్య మిధునం మతాంర ఉ.గం. 9-51.

14 ఆది. ఏకాదశి. హస్త. డోలారోహణస్య సింహోమతాం ర ప.గం. 1-46.

17 బుధ. చతుర్దశి. స్వాతి. అన్నప్రాశనస్య మిధునం ర ఉ.గం. 9-25.

21 ఆది. బ.తదియ. మూల. అన్నప్రాశనస్య మిధునం మతాం ర ఉ.గం. 8-18.

28 ఆది. దశమి. ఉ.భా. అన్నప్రాశనస్య మిధునం మతాం ర ఉ.గం. 8-41, డోలారోహణస్య కన్యార ప.గం. 2-25

### జ్యేష్ఠ మాసము (3-6-2000 నుండి 1-7-2000 వరకు)

జూన్ 11 ఆది. దశమి. హస్త. అన్నప్రాశనస్య మిధునం ర ఉ.గం. 7-47. డోలారోహణస్య కన్యార ప. గం. 1-31.

12 సోమ. ఏకాదశి. చిత్త. అన్నప్రాశనస్య సింహోర ప.గం. 11-50.

17 శని. బ.పాడ్యమి. మూల. అన్నప్రాశనస్య సింహోర ప.గం. 11-32 డోలారోహణస్య కన్యామతాం ర ప.గం. 12-10.

19 సోమ. విదియ. ఉ.షా. అన్నప్రాశనస్య సింహోమతాంర ప.గం. 11-24.

## ఆషాఢ మాసము (2-7-2000 నుండి 31-7-2000 వరకు)

జూలై 10 సోమ. నవమి. స్వాతి. అన్నప్రాశనస్య కన్యాచోరః ఉ.గం. 11-38.

17 సోమ. బ.పాడ్యమి. ఉ.షా. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 11-13.

18 మంగళ. విదియ. శ్రవణం. కన్యామతాంర ఉ.గం. 11-9.

19 బుధ. తదియ. ధనిష్ఠ. అన్నప్రాశనస్య సింహోమతాంర ఉ.గం. 9-28.

22 శని. షష్ఠి. ఉ.భా. డోలారోహణస్య కన్యామతాంర ఉ.గం. 10-53.

27 గురు. ఏకాదశి. రోహిణి. సింహోర ఉ.గం.8-56.

## శ్రావణ మాసము (1-8-2000 నుండి 29-8-2000 వరకు)

ఆగష్టు 4 శుక్ర. పంచమి. హస్త. వివాహ గర్భాధానాదీనాం మీనోర రా.గం. 9-30 (7 చంద్రః).

6 ఆది. సప్తమి. స్వాతి. డోలారోహణ వ్యాపారాదీనాం తులార ప.గం. 12-44. వివాహ గర్భాధానాదీనాం కుంభోర రా.గం. 8-41.

9 బుధ. దశమి. అనూరాధ. అన్నప్రాశన వివాహ గృహారంభప్రవేశ క్రయవిక్రయాదీనాం సింహోర ఉ.గం. 8-03.

11 శుక్ర. ద్వాదశి. మూల. అన్నప్రాశన వివాహాదీనాం సింహోమతాంర ఉ.గం. 7-55.

12 శని. త్రయోదశి. ఉ.షా. వివాహస్య కుంభోర రా.గం. 8-16.

13 ఆది. చతుర్దశి. ఉ.షా. అన్నప్రాశన వివాహ గృహప్రవేశాదీనాం సింహో ర ఉ.గం. 7-47. గృహారంభోపి కన్యాచోరః ఉ.గం. 9-24. డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులార ప.గం. 12-15. వివాహ గృహప్రవేశాదీనాం మీనోర రా.గం.8-55.

14 సోమ. శ్రవణం. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 9-20.

16 బుధ. బ.పాడ్యమి. శతభిషం. అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశాదీనాం సింహోర ఉ.గం. 7-35 (జామిత్ర చంద్రః) వివాహగృహప్రవేశాదీనాం కుంభోర రా.గం. 8-0.

19 శని. చవితి. రేవతి. వివాహ గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యామతాంర 9-01 క్రయవిక్రయాదీనాం తులార ప.గం. 11-52.

23 బుధ. అష్టమి. రోహిణి. అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశాదీనాం కన్యార ఉ.గం. 8-46.

## భాద్రపద మాసము (30-8-2000 నుండి 27-9-2000 వరకు)

ఆగష్టు 31 గురు. శు.విదియ. ఉత్తర. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 8-12.

సెప్టెం. 7 గురు. నవమి. మూల. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 7-44.

10 ఆది. ద్వాదశి. శ్రవణం. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 7-33. డోలారోహణ మకరోర ప.గం. 4-3.

11 సోమ. త్రయోదశి. ధనిష్ఠ. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 10-20.

## ఆశ్వయుజ మాసము (28-9-2000 నుండి 27-10-2000 వరకు)

సెప్టెం. 29 శుక్ర. శు.విదియ. చిత్త. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరోర ప.గం. 2-45. గర్భాధానస్య మేషోర రా.గం. 8-12.

30 శని. తదియ. స్వాతి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరో మతాం ర ప.గం. 2-41. వివాహగర్భాధానాదీనాం మేషోమతాంర రా.గం. 8-08.

అక్టోబరు 1 ఆది. చవితి. అనూరాధ. వివాహస్య కర్కాటకోర రా.గం. 1-19.

4 బుధ. సప్తమి. మూల. వివాహస్య మేషోర రా.గం. 7-53.

7 శని. దశమి. ఉ.షా. నూతనవ్యాపారాదీనాం విజయముహూర్త కాలః ప.గం. 2-10.

8 ఆది. దశమి. శ్రవణం. అన్నప్రాశనవైశ్యోపనయన వివాహక్రయవిక్రయాదీనాం తులామతాంర ఉ.గం.8-30.

11 బుధ. త్రయోదశి. ఉ.భా. వివాహస్య కర్కాటకోర రా.గం. 12-38.

12 గురు. చతుర్దశి. రేవతి. వివాహస్య కర్కాటకోమతాంర రా.గం. 12-34.

13 శుక్ర. పూర్ణిమ. రేవతి. అశ్విని కర్కాటకో రా.గం. 12-31.

18 బుధ. షష్ఠి. మృగశిర. క్రయవిక్రయాదీనాం మీనోర ప.గం. 4-29.

20 శుక్ర. అష్టమి. పుష్యమి. కన్యార తె.గం. 4-49.

## కార్తీక మాసము (28-10-2000 నుండి 25-11-2000 వరకు)

అక్టోబరు 29 ఆది. శు.విదియ. అనూరాధ. వివాహగర్భాధానాదీనాం కర్కాటకోర రా.గం. 11-24 వివాహస్య సింహోర రా.గం. 2-35.

నవంబరు 5 ఆది. నవమి. ధనిష్ఠ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరోర ప.గం. 12-14. శతభిషం. గృహప్రవేశాదీనాం సింహోర రా.గం. 2-7.

10 శుక్ర. చతుర్దశి. అశ్విని. ధనుస్సు ఉ.గం. 10-23.

13 సోమ. బ.విదియ. రోహిణి. గృహప్రవేశస్య సింహోమతాంర రా.గం. 1-35.

17 శుక్ర. షష్ఠి. పుష్యమి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మేషోమతాంర సా.గం. 4-55.

18 శని. సప్తమి. మఘ.

## మార్గశిర మాసము (26-11-2000 నుండి 25-12-2000 వరకు)

నవంబరు 29 బుధ. తదియ. ఉ.షా. వివాహస్య సింహోర రా.గం. 12-34.

30 గురు. చవితి. ఉ.షా. వివాహస్య సింహోర రా.గం. 12-27.

డిశం. 1 శుక్ర. పంచమి. శ్రవణం. అన్నప్రాశన వివాహ క్రయవిక్రయాదీనాం మకరోర ఉ.గం. 10-29.

3 ఆది. సప్తమి. శతభిషం. అన్నప్రాశన వివాహ క్రయవిక్రయాదీనాం మకరోర ఉ.గం. 10-23. డోలారోహణస్య కుంభోర ప.గం. 12-41.

6 బుధ. దశమి. ఉ.భా. అన్నప్రాశనస్య వివాహ వ్యాపారాదీనాం మకరో ర ఉ.గం. 10-21.

7 గురు. ఏకాదశి. అశ్విని. వివాహస్య కర్కాటకో రాజా రా.గం. 8-49.

10 ఆది. చతుర్దశి. రోహిణి. వివాహస్య కర్కాటకోమతాంర రా.గం. 8-39.

11 సోమ. పూర్ణిమ. రోహిణి. అన్నప్రాశన వాణిజ్యాదీనాం మకరోర ఉ.గం. 9-51. మృగశిర గృహ ప్రవేశస్య కర్కాటకోర రా.గం. 8-33.

13 బుధ. బ.విదియ. పునర్వసు. అన్నప్రాశన వ్యాపారాదీనాం మకరోర ఉ.గం. 9-44.

14 గురు. తదియ. పుష్యమి. గర్భాధానగృహప్రవేశాదీనాం కర్కాటకోర రా.గం. 8-22. గృహప్రవేశస్య కన్యార రా.గం. 1-10.

16 శని. షష్ఠి. మఘ. కర్కాటకోపిర రా.గం. 8-14.

20 బుధ. దశమి. చిత్త. గృహప్రవేశస్య సింహేశుభనవాంశ కాలః రా. 10-18. స్వాతి. వివాహస్య కన్యార రా.గం. 12-48.

## పుష్య మాసము (26-12-2000 నుండి 24-1-2001 వరకు)

డిశం. 28 గురు. తదియ. ఉ.షా. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 8-46.

31 ఆది. శతభిషం. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 8-35.

జనవరి 4 గురు. నవమి. అశ్విని. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 8-19.

7 ఆది. ద్వాదశి. రోహిణి. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 8-06.

8 సోమ. చతుర్దశి. మృగశిర. కుంభోర ఉ.గం. 10-21.

11 గురు. విదియ. పుష్యమి. అన్నప్రాశనస్య మకరో ర ఉ.గం. 7-49.

## మాఘ మాసము (25-1-2001 నుండి 23-2-2001 వరకు)

జనవరి 26 శుక్ర. శు.విదియ. ధనిష్ఠ. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం సింహోర రా.గం. 8-48.

27 శని. తదియ. శతభిషం. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం సింహోర రా.గం. 8-43.

29 సోమ. పంచమి. ఉ.భా. అన్నప్రాశనఅక్షర స్వీకార గృహారంభ ప్రవేశ, కూపారంభ దేవతాప్రతిష్ఠా వ్యాపారాదీనాం కుంభోవసుః ఉ.గం. 9-01. గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 10-12.

31 బుధ. సప్తమి. అశ్విని. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ యాత్రాక్రయవిక్రయాదీనాం కుంభోర ఉ.8-53..

ఫిబ్రవరి 4 ఆది. ఏకాదశి. మృగశిర. వివాహగృహప్రవేశాదీనాం సింహోరాజా రా.గం.8-11. కన్యాపి బలీ రా.గం.9-45.

5 సోమ. ద్వాదశి. ఆర్ద్ర. ఆశ్వలాయనోపనయనస్య మీనోర ఉ.గం.9-14. గర్భాధానస్యకన్యార రా.గం.9-42.

7 బుధ. చతుర్దశి. పుష్యమి. గృహప్రవేశస్య కన్యాహోరః రా.గం. 9-35.

8 గురు. పూర్ణిమ. మఘా. వివాహస్య కన్యామతాం ర రా.గం. 9-30.

10 శని. బ.విదియ. ఉత్తర. వివాహగృహప్రవేశ గర్భాధానాదీనాం సింహోర రా.గం. 7-47.

11 ఆది. చవితి. ఉత్తర. వివాహస్య సింహోర రా.గం. 7-44. కన్యామతాంర రా.గం. 9-19.

12 సోమ. పంచమి. హస్త. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార గృహారంభ యాత్రా క్రయవిక్రయ కూపారంభాదీనాం మీనోర ఉ.గం. 9-01. చిత్త. గృహప్రవేశస్య కన్యార రా.గం. 9-15.

13 మంగళ. షష్ఠి. స్వాతి. వివాహ గృహారంభాదీనాం మకరో ర తె.గం. 5-41.

15 గురు. అష్టమి. అనూరాధ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకో ర ప.గం. 4-14. వివాహ గృహారంభ కూపారంభాదీనాం మకరోమతాం ర తె.గం. 5-32.

17 శని. దశమి. మూల. వివాహ గర్భాధానాదీనాం కన్యాహోరః రా.గం. 8-54. వివాహగృహారంభాదీనాం మకరో ర తె.గం. 5-25.

18 ఆది. ఏకాదశి. మూల. మీనోర ఉ.గం. 8-22.

## ఫాల్గుణమాసము (24-2-2001 నుండి 25-3-2001 వరకు)

ఫిబ్రవరి 25 ఆది. శు.విదియ. పూ.భా. ఆశ్వలాయనోపనయనస్య మీనోరాజా ఉ.గం. 7-55. ఉ.భా. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహక్రయ విక్రయాదీనాం మేషోర ఉ.గం. 10-23 (8 కుజః) డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 3-36. వివాహగృహారంభ కూపారంభాదీనాం మకరో ర తె.గం. 4-54.

26 సోమ. తదియ. రేవతి. గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 8-20.

28 బుధ. పంచమి. అశ్విని. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార, వివాహ యాత్రా క్రయవిక్రయ గృహారంభాదీనాం మీనోర ఉ.గం. 7-43.

మార్చి 2 శుక్ర. సప్తమి. రోహిణి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 3-15. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 8-04.

3 శని. అష్టమి. మృగశిర. వివాహ గృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 8-0. వివాహ గృహారంభాదీనాం మకరో ర తె.గం. 4-30.

4 ఆది. నవమి. మృగశిర. అన్నప్రాశనోపనయన అక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశ కూపారంభ వ్యాపార, దేవతాప్రతిష్ఠాదీనాం మీనోర ఉ.గం. 7-27.

5 సోమ. దశమి. ఆర్ద్ర. ఆశ్వలాయనోపనయనస్య మీనోర ఉ.గం. 7-24. పునర్వసు. కన్యామతాంర రా.గం. 7-52.

6 మంగళ. ఏకాదశి. పుష్యమి. గృహారంభస్య మకరోర తె.గం. 4-25.

8 గురు. చతుర్దశి. మఘ. వివాహస్య మీనోర ఉ.గం. 7-12.

10 శని. బ.పాడ్యమి. ఉత్తర. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకశ్చోరః ప.గం. 2-46. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యా మతాంర రా.గం: 7-33. హస్త. వివాహగృహారంభాదీనాం మకరో వసుః తె.గం. 4-03.

11 ఆది. విదియ. హస్త. వివాహ గర్భాధానాదీనాం కన్యార రా.గం. 7-30.

12 సోమ. తదియ. చిత్త. గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యామతాంర రా.గం. 7-25.

15 గురు. షష్ఠి. అనూరాధ. వివాహ గర్భాధానాదీనాం తులార రా.గం. 10-5.

16 శుక్ర. సప్తమి. మూల. వివాహగృహారంభాదీనాం కుంభోర తె.గం. 5-58.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## 5. శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు లేక యుండవలెను.
పాపగ్రహోత్క్రాంత, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| విషేకము | 2-3-5<br>7-10 | సో - బు<br>గు - శు | అ-రో-ఉ.ఫ-హస్త-స్వా-అనూ<br>ఉ.షా-శ్ర-శత-ఉ.భా. | వృష-మిథు-కట<br>కన్య-తు-ధ-మీ | లగ్నశుద్ధి మాఘాది<br>పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5<br>7-10-13 | సో - బు<br>గు - శు | రో-మృ-పున-పుష్య-ఉ.ఫ-హస్త<br>చి-స్వా-అనూ-ఉ.షా-శ్ర-ధ<br>శత-ఉ.భా | వృష-కట-కన్య-తుల<br>ధను-మీనం | 1-8 శుద్ధి పంచపర్వములు<br>కూడవు |
| పుంసవనము<br>సీమంతము | 2-3-5-7<br>7-13 శు | సో - బు<br>గు - శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉ.ఫ-హ-చి-స్వా-అనూ-మూ<br>ఉ.షా-శ్ర-ధ-శత-ఉ.భా-రే | మే-వృశ్చి-సిం<br>లగ్నములు కాక ఇతర<br>లగ్నములు శుభం | 4-8 మాసములు |
| జాతకర్మ<br>నామకరణం | 2-3-5-7<br>10-13 శు | సో - బు<br>గు - శు | అశ్వ-రో-పున-పు-ఉ.ఫ-హ<br>స్వా-అనూ-ఉ.షా-శ్ర-ధ<br>శత-ఉ.భా | వృ-మి-కటక-కన్య<br>తుల-ధ-మీ | అష్టమశుద్ధి<br>పక్షచ్ఛిద్రములు<br>కూడదు |
| డోలారోహణం | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉ.ఫ-హస్త-చి-అనూ<br>ఉ.షా-ఉ.భా-రేవతి | వృ-మి-కట-కన్య-తు<br>ధను-మీనం | 1-3-5 మాసములు<br>అష్టమశుద్ధి |
| అన్నప్రాశనం | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉ.ఫ<br>హ-చి-స్వా-అనూ-ఉ.షా-శ్రవ<br>ధ-శత-ఉ.భా-రేవతి | వృ-మిథు-కన్య-కట<br>ధను-మీనం | 10 శుద్ధి<br>పురుషులకు సరిమాసం.<br>స్త్రీలకు బేసిమాసం |
| కర్ణవేధ | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-మృ-పున-పుష్య-ఉ.ఫ<br>హస్త-చి-అనూ-ఉ.షా-శ్రవ<br>ధని-ఉ.భా-రే | వృ-మి-కటక-కన్య<br>ధను-మీనం | అష్టమశుద్ధి 6-7-8<br>మాసములు |
| కేశఖండనము | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-మృ-పున-పుష్య-హ<br>చి-స్వా-శ్ర-ధ-శత-రే | వృ-మి-కటక-కన్య<br>తుల-ధను-మీనం | ఉత్తరాయణం<br>పూర్వయామం |
| అక్షరాభ్యాసము | 2-3-5<br>7-10 | సో - బు<br>గు - శు | అశ్వ-పున-పుష్య-హ-చి<br>స్వాతీ-అనూ-శ్ర-రే | మే-కట-తు-మకర | అష్టమశుద్ధి ఉత్తరా<br>యణము 5వ సంవత్సరం |
| విద్యాభ్యాసము | 2-3-5<br>7-10 | ఆ-సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఆర్ద్ర<br>ఆశ్లే-హ-చి-స్వా-అనూ-మూ-శ్ర | కట-తుల-మక<br>మీనం-మేషం | అష్టమశుద్ధి<br>అనధ్యాయరహితం |

## శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషరాహిత్యము యుండవలెను
పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| ఉపనయనము | 2-3-5-7-10<br>కృ 2-3-5 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉ.ఫ-హ-చి-స్వా-అనూ-ఉ.షా<br>శ్ర-ధ-శ-ఉ.భా-రే | వృష-మిథున-కటక<br>కన్య-ధను-మీనం | ర శుద్ధి అనధ్యయన<br>కూడదు కేంద్రమున<br>పాపులుండకూడదు |
| వివాహం | 2-3-5-7<br>10-13 | బు-గు-శు | రో-మృ-మఘ-ఉ.ఫ-హ<br>స్వా-అనూ-మూ-ఉ.షా<br>ఉ.భా-రే | వృష-మిథు-కట-తుల<br>కన్య-ధను-మీనం | సప్తమశుద్ధి మఖాది<br>పంచకం |
| నూతన<br>వస్త్రధారణం | 2-3-5-7<br>10-13 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-ఉ.ఫ-హ<br>చి-స్వా-అనూ-మూ-ఉ.షా<br>శ్ర-ధ-శత-ఉ.భా-రే | వృష-మిథు-కట<br>కన్య-తుల-ధ-మీనం | తృతీయశుద్ధి |
| శంకుస్థాపనం | 2-3-5-7<br>10-13 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉ.ఫ<br>హ-చి-స్వా-అనూ<br>ఉ.షా-శ్ర-ధ-శత-ఉ.భా | వృష-మిథు-కన్య<br>ధను-మీనం | చతుర్థశుద్ధి<br>అష్టమశుద్ధి |
| గృహ<br>ప్రవేశము | 2-3-5-7<br>10-13 | బు-గు-శు | రో-మృ-ఉ.ఫ-చి-అనూ<br>ఉ.షా-ధ-శత-ఉ.భా-రే | వృష-మిథు-కన్య<br>ధను-మీనం | వ్యయ, అష్టమశుద్ధి<br>వృషభకలశచక్రశుద్ధి<br>స్థిరలగ్నము |
| కూపారంభం | 2-3-5-7<br>10-13 | సో-గు-శు | రో-పుష్య-మృ-ఉ.ఫ-హ<br>అనూ-ఉ.షా-శ్ర-ఉ.భా | కట-మక-మీనం | లగ్నమున చంద్ర<br>శుక్రులు, ఉత్తరము<br>తూర్పు ఈశాన్యంశుభం |
| ప్రయాణం | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-మృ-పున-పుష్య-హ<br>అనూ-శ్ర-ధ-రే-మూల | మేష-వృష-కట-కన్య<br>తుల-ధను-మీనం | వారశూలలు కూడదు<br>పంచమశుద్ధి |
| బీజావాపనం | 2-3-5-7<br>10-13 | సో - బు<br>గు - శు | అశ్వ-రో-మృ-పుష్య-ఉ.ఫ<br>హ-స్వా-అనూ-ఉ.షా-శ్ర-ధ<br>ఉ.భా-రేవతి | వృష-మిథు-కటక<br>కన్య-ధను-మీనం | విత్తనముల రంగు<br>ననుసరించినవారములు<br>మంచివి |
| క్షౌరం | 2-3-5-7<br>7-10 | సో-బు-శ | అశ్వ-మృ-పున-పు-హ-చి<br>స్వా-శ్ర-ధ-శత | వృష-మిథు-కట-తుల<br>ధను-మీనం | భోజనానన్తరం కూడదు<br>భార్య 5 మాసములు<br>గర్భవతిగనుండకూడదు |
| వాణిజ్యం | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పుష్య-హ<br>చి-అనూ-రేవ-ఉ.త్త-ఉ.షా<br>ఉ.భా | వృష-మిథు-కట<br>కన్య-తు-ధ-మీనం | లాభ 11 స్థానమున<br>శుభగ్రహముగాని<br>దృష్టిగాని శుభము |

## వాస్తుపురుష స్థితి

భాద్రపద ఆశ్వయుజ కార్తీకమాసములందు తూర్పుశిరస్సు గలిగి ఎడమప్రక్కను శయనించును. గాన ఈ మాసములందు పశ్చిమ సింహద్వారము, దక్షిణ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. మార్గశిర, పుష్య, మాఘ మాసములందు దక్షిణ శిరస్సుగ శయనించును. ఈ మాసములందు పడమర సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములందు పశ్చిమ శిరస్సుగ శయనించును. ఇందు తూర్పు సింహద్వారము, ఉత్తర సింహద్వారముగల గృహములకు శంకుస్థాపన చేయవలెను. జ్యేష్ట, ఆషాఢ, శ్రావణ మాసములందు ఉత్తర శిరస్సుగ శయనించును. ఇందు దక్షిణ సింహద్వారము, తూర్పు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. వాస్తుపురుషునికి గల దృష్టికి అభిముఖ సింహద్వార గృహములను పాదములకు అభిముఖ సింహద్వార గృహములకు ఆ యా మాసములందు శంకుస్థాపన చేయరాదు. ఇదియే బహుదేశాచార సిద్ధమున్నూ, వశిష్ఠ, నారద సంహితాది మూలగ్రంథ ప్రమాణ సిద్ధమున్ను అయియున్నది. ఇది త్రైమాసిక వాస్తుపురుషస్థితి పద్ధతి.

## క్షణిక వాస్తు నిర్ణయము

వాస్తు పురుషుడు ప్రతిదినమునందును పగలు మొదటి జామునను, రాత్రి మొదటి జామునను ఉత్తర శిరస్సు తూర్పునకు దృష్టియు గలిగి శయనించును. గావున 1 జామున తూర్పునకు సింహద్వారము దక్షిణమునకు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 2 జామున తూర్పు శిరస్సు దక్షిణ దృష్టి గలిగియుండును. 2 జామున దక్షిణ సింహద్వారము పశ్చిమ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. 3 జామున దక్షిణ శిరస్సు పడమర దృష్టి గలిగియుండును. 3 జామున పడమర సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 4 జామున పడమర శిరస్సు, ఉత్తరమునకు దృష్టియు గలిగియుండును. గావున 4 జామున తూర్పు సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల వాటికిని శంకుస్థాపన చేయవలెను. పైన చెప్పబడిన త్రైమాసిక వాస్తుపురుష స్థితిని బట్టి గృహమునకు శంకుస్థాపన చేయుకాలము లభించని సమయమున ఈ క్షణిక (యామ) వాస్తు నిర్ణయమును అనుసరించి గృహములను నిర్మించుటయు ఆచారసిద్ధము అయివున్నది.

మరియు నాల్గువైపులకు సింహద్వారములు గల (చతుశ్శాల) మండువా లోగిలికి శంకుస్థాపనను అన్ని మాసములందును చేయవచ్చును. మరి వక విశేషము సూర్యుడు స్థిరరాశులగు వృషభ, సింహ, వృశ్చిక కుంభ రాశులలో సంచరించు కాలమున ఏకశాలా (వంటి గర్భము) సర్వముఖ గృహములకును శంకుస్థాపన చేయువచ్చును. 1 వ పద్ధతిచే శంకుస్థాపన కాలమును నిర్ణయించుటకు అవకాశము లేనప్పుడు 2,3 పద్ధతుల బట్టియు ఆచరించుట అత్యవసర పరిస్థితిని బట్టి ఆచారసిద్ధమయి వున్నది.

## దేవాలయారంభము

ఉత్తరాయణము -- చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఫాల్గుణమాసములు ఉత్తమము; శ్రావణ కార్తీక మాసములు మధ్యమము; శుక్ల పక్షము ఉత్తమము, అష్ట్యవంచకమును వదలిన కృష్ణపక్షము మంచిది. సోమ, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తము -- రోహిణి, పునర్వసు, ఉత్తర, హస్త, స్వాతీ, అనూరాధా, శ్రవణము, శతభిషము ఈ నక్షత్రములు ఉత్తమములు, స్థిరలగ్నము ముఖ్యము -- పాపులు 3-6-11 రాశులయందును శుభులు కేంద్ర త్రికోణముల యందును ఉండగా స్థిరలగ్నమున ప్రారంభించుట ఉత్తమోత్తమము.

## దేవాలయ ప్రతిష్ఠ

ఉత్తరాయణము -- చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఫాల్గుణ మాసములు ఉత్తమము -- శ్రావణ, ఆశ్వయుజ కార్తీక మాసములు మధ్యమము, మార్గశీర్ష, మాఘమాసములు పనికిరానివి. అశ్వనీ, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణము ఈ పది నక్షత్రములు -- శుక్ల పక్షము; సోమ, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తములు, స్థిరలగ్నము ఉత్తమము చరలగ్నము పనికిరాదు--శుభులు కేంద్ర త్రికోణములయందును పాపులు త్రిషడాయములయందును ఉండగా స్థిరలగ్నమున దేవాలయము నర్థదు పరమేశ్వరర్చారూపమును ప్రతిష్ఠించుట ఉత్తమోత్తమము.

విశేషము : శ్లో॥ మాతృభైరవ వారాహవార్ధసింహత్రివిక్రమాః,
మహిషాసురహంత్రీ చ స్థాప్యా వై దక్షిణాయనే.

## గృహారంభము

ఉత్తరాయణము -- చైత్రము, వైశాఖము, కార్తీకము, మాఘము, ఈ మాసములు, శుక్ల పక్షమున 2,3,5,7,10,13 తిథులు ప్రశస్తము, కృష్ణపక్షమున చివర పంచకము పనికిరాదు. మిగతా 1,2,3,5 తిథులు పనికివచ్చును - అవమా, త్రిద్యుస్పృక్ మొదలగు దుష్ట తిథులు మంచివికావు -- రోహిణి, మృగశిర, ఉత్తర, హస్త, చిత్త, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్వని, పుష్యమి, స్వాతి, అనూరాధ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ ఏడు నక్షత్రములు మధ్యమములు -- ఇతర నక్షత్రములు మంచివికానేరవు -- బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందువారము ప్రశస్తము -- పరిఘ, వైధృతి, వ్యతీపాత్, గండం, అతిగండం, వ్యాఘాతం ఈ యోగములు మంచివికావు -- భద్రకరణము మంచిదికాదు -- స్థిరలగ్నము, ద్విస్వభావ లగ్నములు మంచివి.

వృషభలగ్నము ప్రశస్తమైనది -- అష్టమశుద్ధి ఉండవలెను. కేంద్రత్రికోణములయందు పాపులు ఉండకూడదు.

శుభగ్రహములు కేంద్ర త్రికోణములయందున్నను పాపులు 3,6,11 రాశుల యందున్నను శుభప్రదము -- గురు శుక్రులయొక్క మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివికావు.

## గృహప్రవేశము

ఉత్తరాయణము -- మాఘ, పాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠమాసములు ప్రశస్తము. కుంభమాసము మంచిదికాదు, శుక్లపక్షము 2,3,5,7,10,13 తిథులు కృష్ణపక్షమున వివర పంచకముగాక 1-2-3- 5 తిథులు మంచివి. అవమాత్రిద్యుస్పృక్ మొదలగు దుష్టతిథులు పనికిరావు. బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందువారము మంచివి- రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్వని, పునర్వసు, హస్త, స్వాతి, శ్రవణం ఈ నక్షత్రములయందు గృహమున ప్రవేశించిన గృహము కొలది కాలములోనే అన్యాక్రాంతమగును- శేషించిన నక్షత్రములు మంచివి కానేరవు -- పరిఘాది యోగములు భద్రకరణము మంచివికావు - జన్మరాశియందు గృహప్రవేశము శుభప్రదము -- గురు శుక్రులయొక్క మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివికావు -- స్థిరలగ్నములు, ద్విస్వభావలగ్నములు మంచివి, వృషభలగ్నము ప్రశస్తమైనది -- ద్వాదశశుద్ధి ఉండవలెను. కేంద్ర త్రికోణములయందు పాపులు వుండకూడదు--శుభులు కేంద్రకోణములయందున్నను పాపులు 3,6,11 రాశులయందున్నను ప్రశస్తమైనది. చంద్రబలము గృహప్రవేశమునకు ముఖ్యముగా చూడతగినది. కలశ వృషభచక్రముల ఫలములనుగూడా చూడుము.

## గృహ నిర్మాణమునకు మాసములు

చైత్రమున శుభము, వైశాఖము సంపద, జ్యేష్ఠము మృత్యు ప్రదము, ఆషాడమున సిరిసంపదలు నశించును. శ్రావణముఖ శుభము, భాద్రపదమున రోగభయము, ఆశ్వియుజమున కలహములు, కార్తీకమున ధనయోగము, మార్గశిరమున ధాన్యము, పుష్యము చోర, అగ్ని ప్రమాదముల భయం, మాఘం వంశాభివృద్ధి, ఫాల్గుణం ధనలాభం.

## శంఖు స్థాపన

కుటుంబములో వివాహము జరిగిన సంవత్సరములోపలను, భార్య గర్భవతిగ యున్నప్పుడు ఆరు మాసముల లోపల గృహ నిర్మాణము చేయరాదు. దేవుని పూజా మందిరము ఈశాన్యములో తూర్పు గోడకుచేర్చి యుంచవలయును. అనగా పూజ చేయుటకు కూర్చుండు వారి ముఖము తూర్పు దిక్కుగ ఉండవలయును. వంట ఆగ్నేయములో తూర్పు గోడకు చేర్చి వంటచేయువారి ముఖము తూర్పును చూచునట్లుండవలయును. మరుగుదొడ్లు ఆగ్నేయ, నైరుతి వాయవ్యములలో వీలునుబట్టి యేర్పరచుకొనవలెను.

ధ్యానపుగాదులు ఉత్తరదిక్కున ఉండవలయును. వాటి ప్రవేశ ద్వారములు దక్షిణమును చూచునట్లుండవలయును. ఈశాన్యములో మరుగుదొడ్లు పెట్టరాదు. ఏ స్థలమునకైను ఉత్తర, ఈశాన్య, తూర్పుల నుండి నీరు బయటకుపోవునట్లు తూములు పెట్టుకొనుట మంచిది. ఆ విధముగ

వీలు లేనప్పుడు ఆగ్నేయ, వాయవ్యమూలల నుండి నీరు బయటకు పోవునట్లు పెట్టుకొనుట మంచిది.

గృహము నిర్మించు స్థలము చతురస్రముగ గాని, దీర్ఘ చతురస్రముగ గాని యుండవలయును. చతురస్రములో నాలుగు దిక్కుల కొలతలు సమానముగా యుండును. దీర్ఘ చతురస్రములో ఎదుటి భుజములు మాత్రమే సమానమైన కొలతలు కలిగియుండును.

నైరుతిమూలనుండి నీరు బయటకుపోవునట్లు తూములు పెట్టరాదు. నీటివాటములు స్థలములకు మాత్రమే చెప్పబడినవి. ఇండ్లలో యీ విధులు పాటించనవసరము లేదు. యింటిలో యుండు గదులను బట్టి నీటివాటములు యేర్పరచుకొనవచ్చును.

సింహద్వారమునకు రెండువైపుల కిటికీలు ఉండవలయును. ఇంటిద్వారములు మూయునప్పుడు తెరచునప్పుడు ధ్వనికలుగరాదు. ఎత్తు తక్కువయిల్లు కుబ్జ గృహమనబడును. అందు నివసించరాదు.

గృహమును కట్టదలచిన స్థలము తూర్పు, ఉత్తరములలో ఎత్తుగయుండి పశ్చిమ, దక్షిణములు పల్లముగ యున్నచో "ఉచ్చవేధ" వచ్చును. ఇది శుభప్రదముకాదు. దక్షిణ, పశ్చిమములు అనగా ఇంటి బయట ఆవరణములయందు మాత్రమే ఎత్తుగా యుండుట మంచిది.

కిటికీలులేని గృహము "అంధకవేధ" కలదియగును, కొబ్బరి, అరటి, దానిమ్మ చెట్లు ఉన్న గృహము సర్వదావృద్ధి పొందుచుండును.

పశ్చిమ, ఉత్తరదిక్కులకు శిరస్సు పెట్టి నిద్రించరాదు. దిగంబరుడుగ శయనించరాదు. దిగంబరుడుగా స్త్రీ సంభోగము చేయరాదు. తడికాళ్ళతో శయనించరాదు.

అన్నదమ్ములు ఒక గృహమును పంచుకొని, అందు నివసించునప్పుడు పెద్దవారు దక్షిణ, పశ్చిమ దిశలలోను, చిన్నవారు తూర్పు, ఉత్తర భాగములలోను యుండుట శుభము.

భోజనము -- తూర్పు లేక ఉత్తరదిశలను చూచుచు కూర్చుండి భోజనము చేయుట శుభప్రదము.

వసారాలు కట్టదలచినచో దక్షిణపుగోడమీద ఎత్తు ఉంచి చూరు ఉత్తరదిశకు దిగునట్లు కట్టవలయును. పడమరదిశలో వసారా వేయునప్పుడు, తూర్పునకు చాలుపెట్టి కట్టవలయును.

తన గృహమునకు చేర్చి తూర్పు, ఉత్తర, ఈశాన్యములలో యున్న స్థలములను కలుపుకొనవచ్చును. దక్షిణ దిశయందుండు స్థలములనుకొని, తన స్థలమునకు కలుపుకొనరాదు. తన గృహమునకు ఈశాన్యములో మట్టిదిబ్బలు, గుట్టలు, పేడకుప్పలు, మరుగుదొడ్లు ఉండరాదు. అట్లున్నచో కష్టనష్టములు కలుగుచుండును.

వాస్తుపురుషునకు సింహద్వారము ముఖము అగును. సింహద్వారమునుబట్టి, ఆ యిల్లు తూర్పు యిల్లు, దక్షిణపు యిల్లు, పడమర యిల్లు, ఉత్తరము యిల్లు అని చెప్పబడును.

1. తూర్పు యిల్లు : పడమరద్వారము పెట్టి, ముఖము తూర్పుగపెట్టి లోనికి ప్రవేశించునది. ఇది తూర్పు యిల్లు అగును. కార్తీక, మాఘమాసములలో కట్టుకొనవలయును. శ-అ-క వర్గుల వారికి అర్వణము.

2. దక్షిణపు యిల్లు : ఉత్తరమున సింహద్వారము పెట్టి, దక్షిణముగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించుచున్నచో, అది దక్షిణపు యిల్లు అనబడును. చ-ట-త-ప వర్గుల వారికి అర్వణము. మాఘ, ఫాల్గుణ, వైశాఖములలో కట్టవలయును.

3. పడమర యిల్లు : తూర్పున సింహద్వారముపెట్టి, పడమర దిశగ ముఖముపెట్టి లోనికి ప్రవేశించునది పడమర యిల్లు. ఫాల్గుణ, వైశాఖ, శ్రావణమాసములలో నిర్మించుట శుభప్రదము. ట-త-ప వర్గుల వారికి శ్రేష్ఠము.

4. ఉత్తరపు యిల్లు : దక్షిణమున సింహద్వారము పెట్టి, ఉత్తరముఖము లోనికి ప్రవేశించునది ఉత్తరపు యిల్లు. శ్రావణ, కార్తీక మాసములలో కట్టవలయును. వ-య-శ వర్గుల వారికి అర్వణము.

గృహముకట్టువారి పేరులో మొదటి అక్షరము అ,క,చ,ట,త,ప,య,శ అను ఎనిమిది వర్గులలో ఏ వర్గునకు చెందినదో ఆ వర్గు స్వస్థానమగును. దానికి 5 వ వర్గు శత్రుస్థానమగును. ఆ శత్రుస్థానములో గృహనిర్మాణము చేయరాదు. అర్వణము కాని వర్గుంకు సంబంధించిన స్థలములలో గృహనిర్మాణము చేసి, అందు నివసించినచో, సదా కష్టనష్టములు కలుగుచుండును.

వంటకు ప్రతి గృహమునకు ఆగ్నేయ గదిలో తూర్పుగ ఆగ్నేయము మూల వంట వేయవలెను. తూర్పుముఖముగ మనము ఉండాలి. లేని యెడల ఆగ్నేయము కుదరనిచో నైఋతి గదిలో ఆగ్నేయము మూల మంచిది.

* * *

# స్థలములు పెరిగిన దిశల ఫలములు

| | | |
|---|---|---|
| ఈశాన్యం | ఉత్తరదిశకు పెరిగిన ధనవృద్ధి, తూర్పుకు పెరిగిన ధనంతోబాటు ధర్మబుద్ధి, ప్రతిష్ట, ఎటు పెరిగినా సిరిసంపద. | పురుష సంతానం లేకుండుట, ఆయుశ్శంక, సంపాదనకు మించిన ఖర్చులు, చిక్కులు, చికాకులు. |
| తూర్పు | ధనవృద్ధి, ఆయుర్వృద్ధి ప్రయోజకులైన పురుష సంతతి. | పురుష సంతతిలోపం, వేధ, అంగవైకల్యం, కీర్తినష్టము. |
| ఆగ్నేయం | తూర్పుకు నిర్వంశత, ఆగ్నేయం కలహాలు, దక్షిణం కీడు. | శుభం, ఒక పరిమితిలో సమ్మానం, స్నేహం, ధైర్యం. |
| దక్షిణం | ఆర్థికనష్టం, స్త్రీ హాని, తగవులు. | స్త్రీలకు శుభం, ఈ దిశ ప్రభావం స్త్రీలపై ఎక్కువ. |
| నైఋతి | శత్రు, రోగ, ఋణబాధలు, దక్షిణపు వైపు పెరిగితే స్త్రీలకు, పశ్చిమం లోనైతే పురుషులకు అకాలమరణ ప్రమాదం. | సంతాన వృద్ధి, సుఖశాంతులు. |
| పశ్చిమం | పెరగకపోవడమే శ్రేయం. పెరిగితే చెట్లు పెంచడం మంచిది. ఈ దిక్కు ప్రభావము మగ సంతతిపై ఎక్కువ. | ఈ దిశ సమానంగా వుండాలి. ఆది గృహ స్థలాన్ని బట్టి జాగ్రత్తగా చూసుకోవాలి. |
| వాయువ్యం | అశాంతి, ఋణబాధలు, అధిక ఖర్చులు, సంతాన నష్టం. | ధన గౌరవములు, మనశ్శాంతి సుఖ సంతోషములు. |
| ఉత్తరం | అష్టయిశ్వర్యములు, సర్వశుభములు, ఉత్తరం తూర్పు ఖాళీస్థలం ఎక్కువ కలిగి వీటిపై ప్రహరీగోడ అలాగే పశ్చిమ సింహద్వారం ఉంచి, ఆగ్నేయం వంట గది ఏర్పర్చిన (దక్షిణం ఎక్కువైతే మంచిది) న్యాయశీలురు, భాగ్యవంతులు, మేధావంతులు అవుతారు. | గృహం పరులపాలవును, కీడు, చిక్కులు, కలహాలు, ఉత్తర ముఖద్వారం గల ఇంట తూర్పున ఖాళీ స్థలం తక్కువై అలాగే దక్షిణదిశ ఖాళీస్థలం ఈ రెంటికన్న ఎక్కువ వున్నచో ఆ ఇల్లు వేలం లేక బాకీల రూపంలో శీఘ్రమే పరాధీనమగును. యజమానులు కూడా మారుతుంటారు. |

# ఎనిమిది దిక్కులా ఎత్తు పల్లముల వలన ఫలములు

| దిశ | ఎత్తుగా వున్న ఫలములు | పల్లముగానున్న ఫలములు |
|---|---|---|
| తూర్పు | సంతానమునకు తీవ్రహాని. | ఆయుర్వృద్ధి, సిరిసంపదలు మంచికీర్తి. |
| ఆగ్నేయం | వాయువ్య ఈశాన్యముల కంటే ఎత్తుగా నున్నచో ధన లాభము, నైఋతికన్న ఎత్తయినచో అశుభము. | వాయువ్య ఈశాన్యముల కన్న పల్లమైనచో దుష్ట ప్రవృత్తి, అగ్ని శత్రు భయము, పుత్ర సంతానారిష్టము. |
| దక్షిణము | పుష్టి, తుష్టి, ఆరోగ్యం, ఆర్థికంగా అధిక్యత. | దరిద్రము -- వ్యాధులూ. |
| నైఋతి | పరువుప్రతిష్టలు ధనవృద్ధి. | దీర్ఘవ్యాధులు, దుర్మరణములు, దుర్వ్యసనములు. |
| పడమర | సంతానవృద్ధి, ప్రతిష్ఠ - పలుకుబడి పెరుగుట. | ధననష్టం, సంతాన నష్టం. |
| వాయువ్యం | ఈశాన్యముకన్న ఎత్తయిన ధనప్రాప్తి, వ్యవహార జయము, నైఋతి, ఆగ్నేయములకన్న ఎత్తైన అశుభం. | ఈశాన్యముకన్న పల్లమైన వ్యాధులు, బాధలు, కలహాలు, నైఋతి, ఆగ్నేయములకన్న పల్లమైన శుభం. |
| ఉత్తరం | కష్టపరంపర, అరిష్టములు, మిక్కిలి అశుభము. | సర్వత్రా విశేష శుభప్రదం. |
| ఈశాన్యము | అష్టకష్టములు - అతి దరిద్రములు, పెంటకుప్పలు, దిబ్బలు, గుట్టలు, పందిళ్లు, పాకలు, పాయిఖానా దొడ్లు, వంటగదులు, గుండ్రని ప్రహరీ గోడలతో స్థలం ఆక్రమించినా, ఎత్తైనా అష్టకష్టములు, దరిద్రములు, ప్రమాద సూచకం, పీడ, పీడ. | నిత్య సుఖ సంతోషములు - అష్టయిశ్వర్య ప్రాప్తి, ఈశాన్యపు తూర్పు వాలు మగవారికి, ఉత్తరముగా పల్లాలు వాలిన స్త్రీలకు సమస్త సత్ఫలితాలు కలిగిస్తాయి. నూతులు, కాలువలు, గోతులు, స్థల వైశాల్యము గృహములలో స్థలవ్యాప్తి, వాడకపు నీరు పారుటవలన ఆర్థికపుష్టి, సర్వ సౌభాగ్యదాయకము. |

## కలశచక్రము యొక్క ఫలము

కలశచక్రమును లిఖించి రవియున్న నక్షత్రము మొదలు 27 నక్షత్రములు కలశముయొక్క పార్శ్వాది భాగములయందువ్రాసి చంద్రుదున్న సుముహూర్తకాలిక నక్షత్రము యెచ్చటనున్నదో తెలుసుకొని లెక్కించి ఫలము చెప్పబడుచున్నది.

దాని పరమార్థము ఈ క్రింద వివరింపబడుచున్నది. రవియున్న నక్షత్రము మొదటిదిగా వ్రాయదగియున్నది. చంద్రుదున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

| | | | |
|---|---|---|---|
| 1) 1. నక్షత్రము | = శిరశ్ఛేదము | 5) 14, 15, 16, 17 నక్షత్రములు | = నిర్ధనం |
| 2) 2, 3, 4, 5, నక్షత్రములు | = పరదేశగమనము | 6) 18, 19, 20, 21 నక్షత్రములు | = గర్భస్రావం |
| 3) 6, 7, 8, 9 నక్షత్రములు | = విర్భయము | 7) 22, 23, 24 నక్షత్రములు | = సంపద |
| 4) 10, 11, 12, 13 నక్షత్రములు | = ధాన్యము | 8) 25, 26, 27 నక్షత్రములు | = పూర్ణాయువు |

## వృషభచక్రముయొక్క ఫలము

వృషభచక్రమును లిఖించి సూర్యుదున్న నక్షత్రము మొదలు అభిజిత్తుతో సహా 28 నక్షత్రములుగా నిర్ణయించి వృషభావయవములయందు వ్రాసి వృషభచక్రము లిఖించి అప్పుడు సుముహూర్తకాలికమగు చంద్రుదున్న నక్షత్రమెచ్చట మున్నదో కనుగొని లెక్కించి ఆ అవయవములననుసరించి ఫలము చెప్పబడుచున్నది. దాని పరమార్థము ఈ క్రింద వివరింపబడుచున్నది.

రవియున్న నక్షత్రము మొదటిదిగా వ్రాయదగియున్నది. చంద్రుదున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

| | | | |
|---|---|---|---|
| 1) 1, 2, 3 నక్షత్రములు | = మృత్యువు | 5) 15, 16, 17. 18 నక్షత్రములు | = ధనము |
| 2) 4, 5, 6, 7 నక్షత్రములు | = దురవస్థ | 6) 19, 20, 21, 22 నక్షత్రములు | = ధాన్యము |
| 3) 8, 9, 10, 11 నక్షత్రములు | = చిరకాలస్థైర్యము | 7) 23, 24, 25 నక్షత్రములు | = సంపద |
| 4) 12, 13, 14 నక్షత్రములు | = దేశభ్రమణము | 8) 26, 27, 28 నక్షత్రములు | = పశువృద్ధి |

## గృహములు కట్టరాని ప్రదేశములు

శక్తికి పార్శ్వమునను, రుద్రునకు దృష్టి ప్రదేశమునను, విష్ణువునకు పృష్ఠభాగమునను ఇండ్లు కట్టరాదు. రాజవీధి మధ్య అడ్డముగా మన్నను కట్టవచ్చును. అవి కొందరిమతము, గోవులుమంద మేయు స్థలము. శ్మశానభూమి, మరుభూమి, మలత్యాగము చేయుస్థలము. చెరువులు బావులు పూడ్చిన స్థలము లందును ఇండ్లు కట్టరాదు. క్రమముగా వంశమునకు లోపము తటస్థించును. దాయాదుల గృహముల గర్భ, వెనుపోటీలు కూడదని బహు శాస్త్రములందు గలదు.

## గృహములో తేనెపట్టు పెట్టినందులకు ఫలము

ఇంటిలో తేనెపట్టు మధ్యభాగమున పెట్టిన యజమానునకు మరణము. తూర్పున ధనలాభము. ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతిభాగమున ధాన్యలాభము, పశ్చిమమున మనోవ్యథ, వాయవ్యమున ధననష్టము,

ఉత్తరమున పుత్రలాభము, ఈశాన్యమున బంధు మిత్రదర్శనము. అశుభ స్థానములయందు పెట్టిన యెడల శాంతిని చేయవలయును.

## గృహములో పుట్టపెట్టినందులకు ఫలమ్

ఇంటి మధ్యలో పుట్టపెట్టిన కళత్రమునకు హాని, తూర్పున యజమానునకుకీడు, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతిభాగమున ధనహాని, పడమర రాజపూజ్యత, వాయవ్యమున మిత్రదర్శనము. ఉత్తరమున పశునాశనము, ఈశాన్యమున ధనలాభము. అశుభస్థానములయందు పెట్టిన యధావిధిగా శాంతి చేయవలయును.

## గృహములో మొండిచేయి మొలచినందులకు ఫలమ్

తూర్పున యజమానునకు హాని, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతి భాగమున శత్రువులకు కీడు, పడమర మరణము, వాయవ్యమున పశువులకు హాని, ఉత్తరమున, ఈశాన్యమున కళత్రహాని, ఈ మొండిచేయి రామహస్తమనియు, రావణహస్తమనియు రెండు విధములుగా నుండును. రామహస్తం సుగంధంతో కూడియుండును అందులకు శాన్తి అవసరములేదు. రావణహస్తము దుర్గంధముతోను ఎర్రని కౌసునీళ్ళతోను కుళ్ళు కలిగియుండును. ఇది యజమానునకు అశుభదాయకము గాన గృహమును ఆరుమాసములు వదలి తరువాత యధాశాస్త్రముగా శాన్తిచేసి ప్రవేశించవలయును. దిక్కులయందు విదిక్కులయందు దోషము కాన యధావిధిగా శాన్తి చేయవలయును. ఆ యా శాంతిని చేసినచో గృహమును వదలిపెట్టనవసరములేదు.

## గృహములో గుడ్లగూబ ప్రవేశించినందులకు ఫలమ్

కాపురము చేయుచున్న ఇంటిలో గుడ్లగూబ ముఖద్వారముగా వచ్చి ప్రవేశించిన పురుషునకు హాని. ఆరు మాసములు ఆ గృహమును వదలి శాన్తినిచేసి ప్రవేశించవలెను. పశ్చాద్వారముగా ప్రవేశించిన స్త్రీకి హాని మూడుమాసములు ఆ గృహమును వదలి శాన్తినిచేసి ప్రవేశించవలెను.

## గృహమునకు పెరటిలో అరటిచెట్టు గెలవేసినందులకు ఫలమ్

తూర్పున శుభము, ఆగ్నేయమున శత్రువృద్ధి, దక్షిణమున బంధుమిత్రనాశనము, నైర్రుతి పుత్ర సంతాన లాభము, పడమర విపత్తు, వాయవ్యమున అనారోగ్యము, ఉత్తరమున ధనలాభము, ఈశాన్యమున కీర్తిలాభము ఇటులనే నారికేళ క్రముక ఖర్జూరాదివృక్షములకు కూడా తెలియవలెను.

## గృహమునందు పిడుగు పడినందులకు ఫలమ్

గృహమునందు పిడుగుపడుటవలన యజమానునకు హాని, ఆవరణమందు పడుటవలన అనుచరులకు హాని గాన యధావిధిగా శాన్తిని చేయవలయును. దేవాలయములందు పిడుగుపడిన గ్రామమునకు క్షేమములేదు. ధర్మకర్తకు, పూజకులకు గూడా నష్టము సంభవించును గాన యధోక్తముగా శాన్తిని చేయవలెను.

## గర్భిణీ స్త్రీ పురుషాది వివేకప్రశ్న

శ్లో॥ లగ్నాద్వ్యాగ్యకళత్ర పుత్ర సహజేష్వ్యేకార జీవాః స్థితాః చేత్పుత్రం ధనమాతృరంధ్ర రిపుగౌచేచ్చంద్రశుక్రౌ సధూమ్ ।
తేష్వర్కేందుసుతౌ నపుంసకమితి ద్విర్వ్యావలగ్నే యది పృచ్ఛేత్ప్రజ్ఞనసీగృహే ఖగయుగం చేద్యుగ్మగర్భం వదేత్ ।

తా॥ ప్రశ్నకాలీన లగ్నమునకు 9, 7, 5, 3 స్థానములయందు రవ్యంగారక గురువులున్నయెడల పురుష శిశువు గలుగునవియు, ఆ ప్రశ్న లగ్నమునకు 2, 4, 6, 8 స్థానములయందు శుక్రచంద్రులుండిరేని స్త్రీ శిశువు గలుగుననియు ఈ స్థానములయందే శని, బుధులున్న యెడల నపుంసకుడనియును, ప్రశ్నలగ్నము ద్విస్వభావలగ్నమై ఆ లగ్నమునకు నాల్గవ స్థానమునందు రెండు గ్రహము లున్నయెడల కవలబిడ్డలు పుట్టుదురనియు తాత్పర్యము.

## గోచారఫలము

శ్లో॥ సూర్యష్షట్త్రిదశస్థిత స్త్రిదశషట్సప్తాద్యగశ్చంద్రమాః
జీవస్సప్తనవద్విపంచమగతశ్చారార్కజౌ షట్త్రిగౌ
సౌమ్యష్షడ్ద్విచతుర్దశాష్టమగతస్సర్వేప్యుపాంతే శుభాః
శుక్రస్సప్తమషడ్దశర్క్ష వహితశ్శేత్సర్వదా తే శుభాః

జన్మకాల చంద్రలగ్నము (లేక నామరాశి) మొదలు ద్వాదశరాశులయందు చారవశంబున రవ్యాది గ్రహములు యిచ్చెడి ఫలములు.

| రాసులు | రవి | చంద్రుడు | కుజుడు | బుదుడు | గురుడు | శుక్రుడు | శని | రాహు-కేతు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స్థానభ్రంశం | సుఖభోజనం | ఖేదః | బంధనం | దేశభ్రంశః | ఆరోగ్యం | విపత్ | భయం |
| 2 | భయం | ధనక్షయః | భాగ్యహానిః | స్వర్ణలాభః | లాభః | భోగః | హానిః | కలహః |
| 3 | సంపత్ | ధనలాభః | భాగ్యం | పీడా | కార్యహానిః | లాభః | సంపత్ | సౌభాగ్యం |
| 4 | మానభంగం | రోగః | శత్రుపీడా | శత్రుక్షయః | వ్యయః | అధికసుఖం | కుక్షిరోగః | మానహానిః |
| 5 | పీడా | కార్యహానిః | శత్రుక్షయః | దారిద్ర్యం | సంపత్ | సుతోదయః | పుత్రక్షయః | వ్యయం |
| 6 | శత్రునాశః | ధనం | అర్థసిద్ధిః | భూమిలాభః | క్లేశం | మానహానిః | లక్ష్మీకరం | సుఖం |
| 7 | వ్యధా | ధనలాభః | అర్థనాశః | ఖేదః | ఆరోగ్యం | రోగః | దైన్యం | రిపుక్షయః |
| 8 | వ్యాధిః | మృత్యుప్రదం | శస్త్రభయం | సంతోషః | వ్యయః | శస్త్రలాభః | మృత్యుప్రదం | శోషణం |
| 9 | క్రోధః | రాజక్రోధం | వ్యయః | వ్యయః | లాభః | ఆభరణం | దేహపీడా | శత్రువృద్ధిః |
| 10 | కార్యసిద్ధిః | సుఖం | మనోదుఃఖం | సుఖం | పీడా | చింతా | పీడా | వ్యయః |
| 11 | ధనలాభం | లాభః | ధనం | ఆనందః | సుఖం | లాభః | లాభః | శుభం |
| 12 | వ్యయః | స్త్రీహానిః | క్రూరం | హానిః | వ్యయః | హానిః | నష్టం | మృత్యుప్రదం |

రవ్యాదినవగ్రహములు ప్రతి రాశియందుండు, కాలప్రమాణము, చంద్రుడు, $2\frac{1}{2}$ దినములు, సూర్య బుధ శుక్రులు ప్రతియొకరు ఒకనెల, అంగారకుడు $1\frac{1}{2}$ నెల, గురువు 1 సం॥రం, రాహు కేతువులు $1\frac{1}{2}$ సంవత్సరం శని $2\frac{1}{2}$ సంవత్సరం ఒక్కొక్క రాశియందు రమారమి సంచరించెదరు.

## నవగ్రహశాంతి

సూర్యగ్రహమును: యథావిధిగా పూజించి, సూర్యనమస్కారములు చేసినను, ఎర్రపువ్వులచే పూజించినను, ఎర్రగుడ్డ, మాణిక్యము ధరించినను, ఎర్ర ఆవు లేక గోధుమలు దానముచేసినను దోషనివృత్తి.

చంద్రగ్రహమును: యధావిధిగా పూజించి, శ్వేతపుష్పములచే పూజించినను, శ్వేతవస్త్రము, ముత్యములు వీటిని ధరించినను, శంఖము లేక బియ్యము వీటిని దానము చేసినను దోషనివృత్తి.

కుజగ్రహమును: యధావిధిగా పూజించి, రక్తవస్త్రము, పగడములు ధరించినను, ఎర్రయెద్దు లేక కందులు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

బుధగ్రహమును: యధావిధిగా పూజించి, పీతాంబరము, మరకతము వీటిని ధరించినను, సువర్ణము లేక పెసలు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

గురుగ్రహమును: యధావిధిగా పూజించి, పుష్యరాగము, పసుపువస్త్రము ధరించినను, లేక శనగలు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

శుక్రగ్రహమును: యధావిధిగా పూజించి, శ్వేతవస్త్రము, వజ్రము ధరించినను, వెండి, తెల్లటి గుఱ్ఱము, అనుములు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

శనిగ్రహమును: యధావిధిగా పూజించి, నల్లనివస్త్రము, ఇంద్రనీలము ధరించినను, నల్ల ఆవు లేక నువ్వులు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

రాహుగ్రహమును: యధావిధిగా పూజించి, గోమేధికమును ధరించినను, కత్తి, ఇనుము, ఉద్దులు (మినుములు) వీటిని దానము చేసినను దోషనివృత్తి.

కేతుగ్రహమును: యధావిధిగా పూజించి, వైడూర్యము ధరించినను, దానము చేసినను, ఉలవలు దానము చేసినను దోషనివృత్తి.

శ్లో॥ గ్రహాయత్తావరేంద్రాణాముచ్ఛ్రియాః పతనానిచ
గ్రహా గావో నరేంద్రాశ్చ బ్రాహ్మణాశ్చ విశేషతః
పూజితాః పూజయన్త్యేవం నిర్దహన్త్యవమానితాః ఇతి.

ఇట్టి ప్రమాణములచే మహారాజులయొక్క ఔన్నత్యములు పతనములు నవగ్రహాధీనములైయున్నవి. నవగ్రహములు మహారాజులు మొదలగువారు తమను పూజించిన వారిని అనుగ్రహించెదరు. అవమానించిన వారిని బాధించెదరు. గాన మానవులయొక్క లోకయాత్ర నవగ్రహాయత్తమగుటచే ఆత్మవిరోధము సంభవించిన సమయమునందైనను నవగ్రహములను యధావిధిగా మనోవాక్కాయములచే పూజించుట ముఖ్య కర్తవ్యము.

## సుముహూర్తములు

దైవజ్ఞులు శుభకార్యములయందు శాస్త్రానుసారముగా తిథి వార నక్షత్ర యోగ కరణ శుద్ధులను సమయశుద్ధిని లగ్నశుద్ధిని పంచకరాహిత్యమును, తారాబల చంద్రబల సంపదలను లగ్నగుణములను సంపాదించి స్వల్పదోషములను మహాదోషములను తొలగించి శుభలగ్నమును ఏర్పరచి ఆ లగ్నములో 2 లేక 3 నిమిషముల పరిమితి గల పుష్కర కాలమును సుమూహూర్తముగా నిశ్చయించుచున్నారు. ఇదియే సుముహూర్తము.

## "నవగ్రహముఖపట్టికా"

| గ్రహములు 1 | వర్ణములు 2 | అధిదేవతలు 3 | స్థానములు 4 | పీఠములు 5 | అగ్ని కుణ్డములు 6 | పుష్పములు 7 | ఓధనములు 8 | సమిధలు 9 | గ్రహ మంత్రము 10 | అధిదేవతా మంత్రము 11 | దానములు 12 | ప్రత్యామ్నా యములు 13 | ప్రత్యధి దేవతలు 14 | ప్రత్యధిదేవతా మంత్రములు 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదిత్యః | రక్తః | అనలః | మధ్య | చతురశ్రం | సభ్యము | కరవీరం | శుద్ధోదన | అర్క | ఆసత్యేన | అగ్నిందూతం | రక్తధేనుః | గోధుములు | పశుపతి | ఏషామీశే |
| చంద్రః | సితః | అప్పతిః | ఆగ్నేయ | వృత్తం | ఆహవనీయ | శంఖపుష్పం | పాయస | పలాశ | సోమోధేనుగ్ం | ఏతేశతం | శంఖం | బియ్యము | గౌరి | గౌరీమిమాయ |
| అంగారకః | అతిరక్తః | గుహః | దక్షిణ | త్రికోణా కారం | అన్వాహార్య | ఉత్పలం | గుడౌదన | ఖదిర | అగ్ని ర్మూర్ధ | స్యోన పృథివి | తామ్రం | కందులు | క్షేత్రపతి | క్షేత్రస్యపతినా |
| బుధః | శ్యామః | హరిః | ఈశాన్య | బాణం | అవసత్య | వంద్యా వర్తం | దధ్యోదన | అపామార్గ | ఉద్బుధ్యస్వ | ఇదంవిష్ణుః | హిరణ్యం | పెసలు | విష్ణుః | విష్ణోరరాట మసి |
| బృహస్పతిః | పీతః | ఇంద్రః | ఉత్తర | దీర్ఘచతురశ్రం | ఆవసథ్య | చంపకం | గౌడిక | అశ్వత్థ | బృహస్పతే అతియత్ | ఇంద్రం ప్రణయంతం | శుక్లంవాసః | శనగలు | బ్రహ్మ | బ్రహ్మ జజ్ఞానం |
| శుక్రః | సితః | శచీ | పూర్వ | పంచకోణం | ఆహవనీయ | మల్లికా | చిత్రౌదన | ఉదుమ్బర | శుక్రంతే అన్యత్ | ఇంద్రాణీ మాసు | హయః | అలచందలు | శుక్రః | ఇంద్ర మరుత్వ |
| శనైశ్చరః | అసితః | ప్రజాపతిః | పశ్చిమ | ధనురాకారం | గార్హపత్య | గిరికర్ణికా | కృసర | శమీ | శన్నోదేవీ | ప్రజాపతే | నీలగౌః | తిలలు | యమః | ఇమం యమప్రస్తరం |
| రాహుః | కృష్ణః | శేషః | నైరుతి | శూర్పాకారం | అన్వాహార్య | కల్హారం | మాషౌదన | దూర్వా | కయా నశ్చిత్ర | ఆయంగౌః | భాగః | మినుములు | నిరృతికాలీ | యత్తేదేవీ |
| కేతుః | ధూమ్రః | యమః | వాయవ్య | ధ్వజాకారం | గార్హపత్య | తాపించం | కణౌదన | కుశ | కేతుం కృణ్వన్ | యమో దాధార | ఆయస దణ్డః | ఉలవలు | చిత్రగుప్తః | సచిత్రచిత్రం |

విశేషములు: 1. గ్రహములకు జపము చేయవలెను. 2. జపదశాంశము తర్పణము చేయవలెను. 3. తర్పణదశాంశము హోమము చేయవలెను. 4. (త్రిమధునాజ్యాభిస్సమిద్భిర్హోమః) పాలు, పంచదార, తేనె త్రిమధువులు. 5. కొన్నిశాఖలవారు ప్రత్యధి దేవతలను కూడా పూజించమన్నారు. 6. కొందరు కుజస్య - గుహః, రాహోః - కళింగః, ప్రత్యధిదేవతలుగా పూజించమన్నారు. 7. అధిదేవతా ప్రత్యధిదేవతలను గ్రహములకు దక్షిణోత్తర పార్శ్వములయందు తదాకృతి పీఠములమీదగాని చతురశ్ర పీఠములమీదగాని పూజించవలెను. 8. అన్నిగ్రహములయొక్క దానములకు ప్రతినిధి సువర్ణముగాను యుండవచ్చును. 9. గ్రహములను, అధిదేవతలను, ప్రత్యధిదేవతలను సువర్ణ ప్రతిమలయందుగాని, కూర్చలయందుగాని ఆవాహనము చేయవగును. 10. ఈ గ్రహశాంతిని పురస్కరించుకుని మహర్షులు "అద్భుతశాన్తి"ని ఉపదేశించినారు.

## లగ్న గుణములు

లగ్నమునకు గురు శుక్రాదులలో నొకరు కేంద్రకోణ ఉచ్చస్థాన మిత్రక్షేత్రములలోనున్న గుణము రవి శని కుజాదులు ౩-౬-౧౧ స్థానములయందున్నను గుణము. ఇటులనే గుణములను తెలియదగినది.

## స్వల్పదోషములు - పరిహారములు

దుశ్శకునములు, దుస్స్వప్నములు, ఇంద్రధనుస్సు ధూమకేతువు దుష్టవస్తుదర్శనము దుర్వాక్యశ్రవణము గురుశుక్రుల సమసప్తకము యమకంటకం గుళికదోషం ఖచరయోగం శుభగ్రహవేధ శూన్యతిథులు మొదలగునవి. వీనికి పరిహారములు పై చెప్పిన లగ్నగుణములు, 'హన్త్యేవదోషార్బుదం' అనుటచే శుభులు అర్బుద స్వల్పదోషములను 'హన్త్యాశుదోషాయుతం' అనుటచే పాపులు ఆయుత స్వల్పదోషములను తొలగించుచున్నారు. అని శాస్త్రములు చెప్పుచున్నవి.

## ఏకవింశతి మహాదోషములు

1. పంచాంగశుద్ధిరాహిత్యదోషం
2. సంక్రాన్తిదోషము
3. పాపషడ్వర్గదోషము
4. కునవాంశదోషము
5. కుజాష్టమదోషము
6. భృగుషట్కదోషము
7. కర్తరీదోషము
8. అష్టమలగ్నదోషము
9. అష్టమచంద్రదోషము
10. షడష్టరిష్ఫచంద్రదోషము
11. సగ్రహచంద్రదోషము
12. దుర్ముహూర్తదోషము
13. ఖర్జూరిస్థసమాంఘ్రిభదోషము
14. గ్రహణభదోషము
15. ఉత్పాతభదోషము
16. క్రూరయుగ్భదోషము
17. అశుభవిద్ధభదోషము
18. విషయుగ్లగ్నదోషము
19. లగ్నాన్తదోషము
20. గండాన్తదోషము
21. వ్యతీపాతవైధృతిమహాదోషము

ఈ దోషములయొక్క స్వరూపమును శాస్త్రములవల్ల తెలుసుకొనుట యుక్తముగాన వ్రాయబడలేదు.

## లగ్న పుష్కరకాలములు

"ఏకవింశో మనుశ్చైవ జినాశ్చమునయః క్రమాత్ । మేషాది మీనపర్యన్తం పుష్కరాంశాః ప్రకీర్తితాః॥"

## గోధూళిలగ్నము

సూర్యోదయ లగ్నమునకు సప్తమలగ్నము గోధూళిలగ్నము. ఇది సర్వశుభకార్యములయందు శుభప్రదము. ఈ లగ్నము పశ్చిమదేశీయులచేత కళింగ దేశీయులచేతను ముఖ్యముగా ఉపయోగించబడుచున్నది.

## అభిజిల్లగ్నము

సూర్యుడుదయించుచున్న లగ్నమునకు నాల్గవలగ్నము అభిజిల్లగ్నము. ఇది సర్వదోషములను నశింపచేయును. సర్వదేశములయందును సర్వవర్ణములయందును ఉపనయనాతిరిక్తములగు సర్వశుభకర్మల యందును సర్వకార్యముల యందును ప్రశస్తమైనది. అని మహర్షులు చెప్పుచున్నారు. దైవజ్ఞులు నిశ్చయించెడి సుముహూర్తములకు లగ్నబల సంపదచే స్వల్పదోషములు నశించినను మహాదోషములు తొలగుటనుగూర్చి చెప్పటలేదు. ఈ అభిజిల్లగ్నమును గూర్చి శాస్త్రము "అశేషదోషాపహరం" అని దోషవిభేదము లేకనే సర్వదోషములను నశింపచేయును అని చెప్పుచున్నది. గాన

దైవజ్ఞభారము వహించలేనివారు ఈ అభిజిల్లగ్నమును సర్వకార్యములయందును ఆశ్రయించుట మంచిది. ఈ లగ్నము మన పూర్వులంగీకరించినదే గాన అభిజిల్లగ్నము శుభప్రదం.

## శుద్ధి విశేషములు

ప్రవేశే ద్వాదశే శుద్ధిః యుద్ధేచైకాదశే తథా ప్రాశనే దశమేశుద్ధిః నవమేచౌలకర్మణి
ఉపనాయేష్టమే శుద్ధిః వివాహే సప్తమే తథా నవవస్త్రైచ షట్శుద్ధిః ప్రయాణేపంచమే తథా
విద్యారంభే చతుశ్శుద్ధిః ఔషధే చ తృతీయకే ద్విశుద్ధిర్నామకరణే లగ్నశుద్ధిస్తుసంగమే

వివాహలగ్న విశేషములు : వివాహలగ్నమునకు పై చెప్పిన సప్తమశుద్ధిలేని యెడల జామిత్ర దోషము కలుగును. అనగా ఆ స్థానమునందు రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్రులలో నొక్కరున్న క్రమంగా వైధవ్యమును, సాపత్న్యమును, (సవతిని) మరణమును, పుత్రహానిని, నాశమును, రోగమును, స్త్రీకి కలుగజేయుదురు. శని, రాహు, కేతువులున్న క్రమముగా దంపతులకు మరణము బంధనం ఆపదలు కలుగచేయుదురు. అని కొందరు సమయవేత్తలు చెప్పుచున్నారు. కొందరు శుభగ్రహములున్న దోషము లేదని చెప్పుచున్నారు.

ఉపనయన లగ్నవిశేషములు : లగ్నమునకు 1-4-7-10 స్థానములయందు క్రూరగ్రహములు 1 రవి, 2 కుజుడు, 3 శని, 4 రాహువు; 5 కేతువు ఉండకూడదు. రవి యున్న స్ఫూజిత దోషము వటువును తండ్రిని హరించును. కుజుడున్న కూజితదోషము తల్లిని హరించును. శనియున్న రుధిరదోషము ఉపనీతుని కులమును హరించును. రాహువున్న ఉగ్రదోషము వటువును హరించును. 1 కేతువున్న రంధ్రదోషము తండ్రిని హరించును. గాన ఇట్టి దోషములు లేక లగ్నగుణ సంపద కలిగి మహాదోషశూన్యమగు ముహూర్తమును నిశ్చయించుట దైవజ్ఞుని పూర్ణవిజ్ఞాన సాధ్యము చిరకాల సాధ్యముగా తెలియవలెను.

## శాస్త్ర ప్రబోధము

ఉద్వాహాదిషుచైకవింశతి మహాదోషాఃవిసృజ్యేతరాః స్వల్పాః దోషగణాః గుణాంశ్చగణితాః నిశ్చిత్యశాస్త్రాత్స్ఫుటం లగ్నం యత్ర గణాధికం చ సకలైర్గ్రాహ్యం న దోషాధికం బ్రహ్మాపాపరిహర్తుమత్ర సకలాః దోషాఃసమర్థ న హి".

**తా॥** వివాహాది శుభలగ్నములయందు ఏకవింశతి మహాదోషాతి రక్తములగు స్వల్పదోషములను లగ్నగుణములను శాస్త్రముచే నిర్ణయించి దోషాధిక్యములేక గుణాధిక్యముగల లగ్నమును గ్రహించవలెను. లగ్నమందు సర్వదోషములు నివృత్తిచేయుటకు సృష్టికర్తయే సమర్థుడు కానేరదు. అందుచే దోషశూన్యమగు లగ్నము మృగ్యమని భావము.

## ఉపసంహారము

యావత్స్పందతిలోచనం శుభకరం తత్కోటిభాగో భవేత్ తల్లగ్నేశుభకాల ఏవ సతతం బ్రహ్మాపజానాతితం।
అన్వేకింపునరేవ కర్తురథతత్కాలశ్శుభోవా౽శుభః పూర్వాదృష్టవశాద్భవేత్పమయవిత్తత్సాక్షిమాత్రంసదా'।

**తా॥** కనురెప్పపాటు కాలములో కోట్యంశ కాలము లగ్నములో శుభకాలము అది చిత్ర విచిత్ర నిర్మాణ చతురుండగు విధాతకు గూడా తెలియ సాధ్యముకాదు, అట్టి సూక్ష్మకాలమును మానవుడెట్లు తెలియగలడు. జన్మాంతరీయాదృష్టము వలననే అతిసూక్ష్మమగు శుభకాలము సంప్రాప్తమగును. అది దైవాధీనము. దైవజ్ఞుడు లగ్నమునకు సాక్షిమాత్రుడే కాని లగ్నవిధాత కానేరదు అందువలన అఖిల చరాచర సృష్టి కర్తయు ఆశ్రితజాత్పల్యైకజలధియునై శేషపర్వతమున

వేంచేసియున్న శ్రీశ్రీనివాస పరదైవముయొక్క అనుగ్రహముమీద నాధారపడియున్న ఆ సుముహూర్త కాలమును పొందుటకు మానవుడు ఆ మహాప్రభువు యొక్క అనుగ్రహమునకు ఎదురుచూచుటయే ముఖ్యకర్తవ్యమని సమయవేత్తలు వక్కాణించుచున్నారు.

హైమోర్ధ్వపుండ్రమజహన్మకుటం సునాసం మన్దస్మితం మకరకుణ్డలచారుగణ్డమ్ ।
బిమ్బాధరం బహులదీర్ఘ కృపాకటాక్షం శ్రీవేఙ్కటేశ మజమాత్మవిభావయేఽహమ్ ।

శ్రీలక్ష్మీవేంకటేశార్పణమస్తు



| ఇంగ్లీషు | అరవం | గ్రహ గతులు | శ్రీ విక్రమనామ సంవత్సర చైత్రమాసః ఉత్తరాయణం<br>వసంతఋతుః, శాలిశకాబ్దాః ౧౯౨౨ కల్యబ్దాః ౫౧౦౧ ఇంగ్లీష్ 2000 |
|---|---|---|---|
| 5 | ౨౩ | శు | బుధ. శుక్ల ప్రతిపత్ ౪౧-౨౬ రా.గం. 10-45 రేవతి ౨౨-౧౧ ప.గం. 3-03 ఐంద్రం ౦-౧ వైధృతి ౫౫-౦౩ కింస్తు ౧౨-౪౪ అహః ౩౦-౨౮ త్యాజ్యాభావః అమృ ౧౬-౧౪ యోగః, ఉగాదిః వసంత నవరాత్రారంభః, తిరుమల శ్రీవారి విశ్వోత్సవారంభం, శ్రీవారి ఆస్థానము, తిరుపతి శ్రీ కో.రా. స్వామివారి గరుడోత్సవము. భోగ్యం ౧-౯. |
| 6 | ౨౪ | రక్షు బుగు | గురు. విదియ ౩౮-౫౮ రా.గం. 9-21 అశ్విని ౨౦-౫౧ ప.గం. 2-30 విష్కం ౪౯-౨౦ బాలవ ౯-౪౨ అహః 30-30 ఉ.వ. 10-35 ల 12-9, రా.వ. 11-43 ల 1-15 అమృ ౩-౦౫ రేవతి ౩ రవిః ౪౨-౨౦ భరణి ౨ కుజః ౨౫-౪౦ భరణి ౨ గురుః ౫౮-౨౮ పూ.భా. ౩ బుధః ౧౮-౫౪. చంద్రదర్శనం, దక్షిణశృంగం, సమార్ఘః. భో. ౧-౦౧. |
| 7 | ౨౫ | శు | శుక్ర. తదియ ౩౩-౩౩. రా.గం. 7-34 భరణి ౧౮-౩౦ ప.గం. 1-33 ప్రీతి ౪౨-౫౩ తైతుల ౫-౪౫ అహః ౩౦-౩౨ రా.వ. 12-55 ల 2-26 అమృతం ౭-౦ ఉ.భా. ౨ శుక్రః ౧౧-౨౩. మత్స్య జయంతి. భో. ౦-౫౩. |
| 8 | ౨౬ (పంగుని) | బు | శని. చవితి ౨౮-౨౫ పా.గం. 5-30 కృత్తిక ౧౫-౨౫ ప.గం. 12-18 ఆయు ౩౫-౪౮ వణి ౧-౩౦ భద్ర ౨౮-౨౫ అహః ౩౦-౩౪ రా.వ. 3-19 ల 4-49 అమృ ౯-౪౩ పూ.భా. ౪ మీనే వీచే బుధః ౪౫-౨౬. తిరుపతి శ్రీ కో.రా. స్వామివారి రథోత్సవము. భో. ౦-౪౫. |
| 9 | పంగుని ౨౭ | శు | ఆది. పంచమి ౨౨-౪౯ ప.గం. 3-14 రోహిణి ౧౧-౪౬ ఉ.గం. 10-49 సౌభా ౨౮-౧౯ బాలవ ౨౨-౪౯ అహః ౩౦-౩౬ పా.వ. 4-03 ల 5-33 అమృ ౪-౧౫ పునర్వసు ౪౭-౧౫ ఉ.భా. ౩ శుక్రః ౫౪-౩౦ తిథి (౫+౬) ద్వయము. తిరుపతి శ్రీ కో.రా. స్వామివారి బ్రహ్మోత్సవ అవభృథము, చక్రస్నానము, ధ్వజావరోహణము. శ్రీ మధురకవియాళ్వార్ ఉత్సవారంభః. భో. ౦-౩౭. |
| 10 | ౨౮ | ర | సోమ. షష్ఠి ౧౬-౫౪ ప.గం. 12-51 మృగశిర ౭-౪౮ ఉ.గం. 9-13 శోభ ౨౪-౪౫ తైతుల ౧౬-౫౪ అహః ౩౦-౩౮ పా.వ. 5-02 ల 6-31 అమృ ౪౦-౨౨ రేవతి ౪ రవిః ౬-౧౦. సప్తమీ తిథిః. భో. ౦-౨౯. |
| 11 | ౨౯ | కుబు | మంగళ. సప్తమి ౧౦-౫౦ ఉ.గం. 10-25 ఆర్ద్ర ౩-౩౭ ఉ.గం. 7-32 పునర్వసు ౫౫-౪౪ తె.గం. 5-50 అతి ౧౩-౦ వణి ౧౦-౫౦ అహః ౩౦-౪౦ రా.వ. 6-41 ల 8-10 అమృ ౫౩-౪౭ భరణి ౩ కుజః ౪-౫ ఉ.భా. ౧ బుధః ౪-౩౨ ఉభయానధ్యాయః. భో. ౦-౨౦. |
| 12 | ౩౦ | శు | బుధ. అష్టమి ౪-౫౧ ఉ.గం. 8-02 పుష్యమి ౫౪-౧౧ తె.గం. 5-42 పుష్యమి ౫౫-౩౫ తె.గం. 4-18 సుకర్మ ౫-౨౦ ధృతి ౫౨-౨౯ బవ ౪-౫౧ బాలవ ౨౭-౫ అహః ౩౦-౪౨ ప.వ. 1-20 ల 2-50 అమృ ౪౦-౩౫ ఉ.భా. ౪ శుక్రః ౩౬-౫౧. శ్రీరామ నవమి, ఆస్థానము. భో. ౦-౧౨. |
| 13 | ౧ | రబు | గురు. దశమి ౫౩-౪౬ తె.గం. 3-34 ఆశ్లేష ౫౨-౯ రా.గం. 2-55 శూలం ౫౦-౪౪ తైతుల ౨౬-౨౫ అహః ౩౦-౪౪ పా.వ. 4-22 ల 5-52 అశ్విని ౧ మేషే ఉచ్చే రవిః ౩౦-౧౮ అమృ ౪౮-౨౩ ఉ.భా. ౨ బుధః ౧౮-౪౮. ధర్మరాజ దశమి, అస్మిన్దినే మేష సం॥ ప్రయుక్త విషువత్పుణ్యకాలః, కూవ్వార్తః, శ్రీరామ పట్టాభిషేకము, సౌరవత్సరాది. భో. ౦-౦౪. |
| 14 | ౨ | | శుక్ర. ఏకాదశి ౪౯-౧౨ రా.గం. 1-44 మఘ ౪౯-౨౨ రా.గం. 1-48 గండం ౪౪-౧౧ వణి ౨౧-౨౮ అహః ౩౦-౪౬ ప.వ. 2-22 ల 3-54 అమృ ౪౩-౩౯. సర్వ ౧౧శీ. మేషభోగ్యం ౪-౨౪. |
| 15 | ౩ | కుబు శుశ | శని. ద్వాదశి ౪౫-౩౭ రా.గం. 12-17 పుబ్బ ౪౭-౩౮ రా.గం. 1-5 వృద్ధి ౩౮-౨౯ బవ ౧౭-౨౪ అహః ౩౦-౪౮ ఉ.వ. 9-33 ల 11-6 అమృ ౩౨-౬ భరణి ౪ కుజః ౪౨-౪౮ భరణి ౪ శనిః ౧౫-౪౬ ఉ.భా. ౩ బుధః ౨౬-౩౦ రేవతి ౧ శుక్రః ౧౮-౫. తిరుపతి శ్రీ గో.రా. స్వామివారి బుగ్గోత్సవ ప్రా॥ భో. ౪-౧౫. |
| 16 | ౪ (చిత్తిరై) | ర | ఆది. త్రయోదశి ౪౨-౫౦ రా.గం. 11-10 ఉత్తర ౪౬-౩౯ రా.గం. 12-42 ధ్రువం ౩౩-౨౬ కౌలవ ౧౪-౦౩ అహః ౩౦-౫౦ ఉ.వ. 8-10 ల 9-44 అమృ ౨౯-౦ అశ్విని ౨ రవిః ౫౪-౨౭ ప్రదోషః. అనంగ త్రయోదశీ, తిరుమల శ్రీవారి వసంతోత్సవ ప్రారంభం. భో. ౪-౭. |
| 17 | ౫ | బు | సోమ. చతుర్దశి ౪౧-౨౪ రా.గం. 10-35 హస్త ౪౭-౦ రా.గం. 12-49 వ్యాఘా ౨౯-౨౩ గర ౧౨-౭ అహః ౩౦-౫౧ ఉ.వ. 9-8 ల 10-44 అమృ ౩౧-౫౪ ఉ.భా. ౪ బుధః ౩౪-౧౮. తిరుపతి శ్రీ గో.రా. స్వామివారి సన్నిధిని బుగ్గోత్సవ సమాప్తి. భో. ౩-౫౮. |
| 18 | ౬ | శు | మంగళ. ◯ పూర్ణిమ ౪౧-౦ రా.గం. 10-24 చిత్త ౪౮-౨౦ రా.గం. 1-20 హర్ష ౨౬-౧౦ విష్టి ౧౧-౧౨ అహః ౩౦-౫౨ ఉ.వ. 8-59 ల 10-37 అమృ ౩౨-౦ రేవతీ ౨ శుక్రః ౦-౨౦ అన్వాధానం. మహాచైత్రీ, తిరుమల శ్రీవారి వసంతోత్సవ సమాప్తి, తిరుపతి శ్రీ గో.రా.స్వామి వారి పొన్నకాల్వ ఉత్సవము, శ్రీ మధురకవి ఆళ్వారు శాత్తుమొర, నాగులాపురం శ్రీ వే.నా. స్వామివారి బ్రహ్మోత్సవ అంకురార్పణం. భో. ౩-౫౦. |

(Left margin: ఏప్రిల్ 2000)

మాసాదిచక్రం

| ర చం శు | కు గు శ | | |
|---|---|---|---|
| బు / కేతు | మాసాదిచక్రం | | రా |
| | | | |

వత్సరారంభగ్రహచారాః
రేవతి ౨ రవిః, ఉ.భా. ౧ శుక్రః,
భరణి ౨ కుజః, భరణి ౩ శనిః,
పూ.భా. ౨ బుధః, పుష్య ౨ రాహుః,
భరణి ౧ గురుః, ఉ.షా. ౪ కేతుః.

| మాసం | తేదీ | | | | వివరాలు |
|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 2000 | 19 | చైత్రి ని (మేషమాసః) | ౭ | బు | బుధ. బ.ప్రతిపత్ ౪౨-౦ రా.గం. 10-49 స్వాతి ౫౧-౭ రా.గం. 2-27 వజ్రం ౨౪-౪ బాలవ ౧౧-౨౯ అహః ౩౦-౫౪ ఉ.వ. 7-12 ల 8-52 అమృ ౨౮-౫ రేవతి ౧ బుధః ౩౩-౨౫ యాగకాలః, నాగులాపురం శ్రీ వే.నా. స్వామివారి బ్రహ్మోత్సవ ప్రా॥ ధ్వజారోహణం. భో. ౩-౪౧. |
| | 20 | | ౮ | రకుశు | గురు. విదియ ౪౪-౮ రా.గం. 11-39 విశాఖ ౫౫-౦ తె.గం. 4-0 సిద్ధి ౨౨-౫౪ తైతుల ౧౩-౪ అహః ౩౦-౫౫ ఉ.వ. 8-24 ల 10-6 అమృ ౩౧-౩౫ అశ్విని ౩ రవిః ౧౯-౪౪ కృత్తికా ౧ కుజః ౨౩-౨ రేవతీ ౩ శుక్రః ౪౨-౩౨. భో. ౩-౩౩. |
| | 21 | | ౯ | అయ బుగు | శుక్ర. తదియ ౪౭-౩౦ రా.గం. 12-59 అనూరాధ ౬౦-౦ పూర్తి. వ్యతీ ౨౨-౪౨ వణి ౧౫-౪౯ అహః ౩౦-౫౬ ఉ.వ. 8-20 ల 10-04 అమృ ౩౨-౦ వృషభాయనం ౨౦-౪౧ భరణీ ౩ గురుః ౧౬-౯ రేవతి ౨ బుధః ౩౧-౦. శ్రీ పరాశర భట్టర్ వర్ష తి.వ. భో. ౩-౨౪. |
| | 22 | | ౧౦ | | శని. చవితి ౫౧-౪౯ రా.గం. 2-41 అనూరాధ ౦-౧౭ ఉ.గం. 6-05 వరీ ౨౩-౧౪ బవ ౧౯-౩౯ అహః ౩౦-౫౮ ప.వ. 12-15 ల 2-01 అమృ ౪౨-౬. భో. ౩-౧౬. |
| | 23 | | ౧౧ | రబుశు | ఆది. పంచమి ౫౭-౦ తె.గం. 4-45 జ్యేష్ఠ ౬-౧౬ ఉ.గం. 8-28 పరి ౨౪-౩౦ కౌలవ ౨౪-౨౪ అహః ౩౧-౦ పా.వ. 5-18 ల 7-04 అమృ ౫౪-౫౧ అశ్విని ౪ రవిః ౪౪-౫౩ రేవతీ ౩ బుధః ౨౨-౪౪ రేవతీ ౪ శుక్రః ౨౪-౪౮. నాగులాపురం శ్రీ వే.నా. స్వామివారి గరుడోత్సవము. భో. ౩-౭. |
| | 24 | | ౧౨ | గు | సోమ. షష్ఠి ౬౦-౦ పూర్తి. మూల ౧౨-౩౩ ఉ.గం. 10-59 శివం ౨౫-౫౩ గర ౨౯-౩౧ అహః ౩౧-౨ ఉ.వ. 9-13 ల 10-59, రా.వ. 9-38 ల 11-24 పశ్చాదస్తమితో గురుః ౩౦-౪౨ అమృతాభావః. భో. ౨-౫౮. |
| | 25 | | ౧౩ | కుబు | మంగళ. షష్ఠి ౨-౫ ఉ.గం. 6-47 పూ.షా. ౧౯-౭ ప.గం. 1-36 సిద్ధం ౨౭-౨౭ వణి ౨-౫ అహః ౩౧-౪ రా.వ. 10-26 ల 12-12 అమృ ౫-౪౮ కృత్తికా ౨ వృషభే మి. కుజః ౪- ౨౫ రేవతి ౪ బుధః ౧౨-౨౧ కేక్రాం ౧౯ ఉ. భో. ౨-౫౦. |
| | 26 | | ౧౪ | బుశు | బుధ. సప్తమి ౭-౦ ఉ.గం. 8-43 ఉ.షా. ౨౫-౨౦ పా.గం. 4-6 సాధ్యం ౨౮-౪౮ బవ ౭-౦ అహః ౩౧-౬ రా.వ. 8-29 ల 10-14 అమృ ౭-౪౪ అశ్విని ౧ మేషే శ. బుధః ౫౯-౦ అశ్విని ౧ మేషే శ. శుక్రః ౭-౦ కేక్రా ౨౫ ప. ఉభయానధ్యాయః. నాగులాపురం శ్రీ వే.నా.స్వామివారి రథోత్సవము. భో. ౨-౪౧. |
| | 27 | | ౧౫ | | గురు. అష్టమి ౧౧-౨౯ ఉ.గం. 10-32 శ్రవణం ౩౧-౪ రా.గం. 6-22 శుభం ౨౯-౩౫ కౌలవ ౧౧-౨౯ అహః ౩౧-౮ రా.వ. 10-40 ల 12-22 అమృ ౨-౩౭. నాగులాపురం శ్రీ వే.నా. స్వామివారి బ్రహ్మోత్సవ అవభృథము, చక్రస్నానం, ధ్వజావరోహణం. భో. ౨-౩౩. |
| | 28 | | ౧౬ | రబుశు | శుక్ర. నవమి ౧౪-౫౬ ప.గం. 11-55 ధనిష్ఠ ౩౫-౪౬ రా.గం. 8-15 శుక్లం ౨౯-౩౬ గర ౧౪-౫౬ అహః ౩౧-౯ తె.వ. 3-53 ల 5-35 భరణీ ౧ రవిః ౧౦-౫౫ అమృ ౭-౪౩ అశ్విని ౨ బుధః ౪౩-౦ అశ్విని ౨ శుక్రః ౪౯-౧౦. దశమీ తిథిః. భరణీకార్తె. భో. ౨-౨౪. |
| | 29 | | ౧౭ | కు | శని. దశమి ౧౭-౨౦ ప.గం. 12-51 శతభిషం ౩౯-౧౮ రా.గం. 9-39 బ్రాహ్మం ౨౮-౪౩ భద్ర ౧౭-౨౦ అహః ౩౧-౧౧ తె.వ. 4-18 ల అమృ ౨౦-౨౧ కృత్తికా ౩ కుజః ౪౭-౪౬. ఏకాదశీ తిథిః, శ్రీ భాష్యకారుల ఉత్సవారంభము. భో. ౨-౧౬. |
| | 30 | | ౧౮ | రబు | ఆది. ఏకాదశి ౧౮-౨౬ ప.గం. 1-17 పూ.భా. ౪౧-౪౨ రా.గం. 10-35 ఐంద్రం ౨౬-౫౩ బాలవ ౧౮-౨౬ అహః ౩౧-౧౩ ఉ.శే.వ. 5-57 వ. భరణీ ౨ రవిః ౩౭-౨౩ అమృ ౨౦-౫౪ అశ్విని ౩ బుధః ౨౪-౦. మత్త్రయ ఏకాదశీ, ద్వాదశీ తిథిః. భో. ౨-౭. |
| మే 2000 | 1 | | ౧౯ | శు | సోమ. ద్వాదశి ౧౮-౧౪ ప.గం. 1-12 ఉ.భా. ౪౨-౩౮ రా.గం. 10-58 వైధృతి ౨౩-౫౬ తైతుల ౧౮-౧౪ అహః ౩౧-౧౩ ఉ.వ. 8-20 ల 9-58 అమృ ౩౦-౨౭ అశ్విని ౩ శుక్రః ౩౧-౨౪. త్రయోదశీ తిథిః. మే డే. భో. ౧-౫౯. |
| | 2 | | ౨౦ | బు | మంగళ. త్రయోదశి ౧౬-౫౧ ప.గం. 12-39 రేవతి ౪౨-౩౩ రా.గం. 10-56 విష్కం ౨౦-౭ వణి ౧౬-౫౧ అహః ౩౧-౧౪ ఉ.వ. 10-57 ల 12-33 అమృ ౩౬-౩౩ అశ్విని ౪ బుధః ౪-౦. మాసశివరాత్రిః, చతుర్దశీ తిథిః. అనధ్యాయః. భో. ౧-౫౦. |
| | 3 | | ౨౧ | బు | బుధ. చతుర్దశి ౧౪-౧౭ ప.గం. 11-37 అశ్విని ౪౧-౧౪ రా.గం. 10-23 ప్రీతి ౧౫-౨౩ శకుని ౧౪-౧౭ అహః ౩౧-౧౬ రా.వ. 6-28 ల 8-02 అమృ ౨౩-౩౮ భరణీ ౧ బుధః ౧౨-౪ రక్రాం ౪౧ ఉ. అన్వాధానం. భో. ౧-౪౨. |
| | 4 | | ౨౨ | రకుశు | గురు. ● అమావాస్య ౧౦-౫౦ ఉ.గం. 10-13 భరణీ ౩౯-౬ రా.గం. 9-31 ఆయు ౯-౪౮ నాగ ౧౦-౫౦ అహః ౩౧-౧౮ ఉ.వ. 7-38 ల 9-10 భరణీ ౩ రవిః ౩-౫౨ అమృ ౨౭-౩౨ కృత్తికా ౪ కుజః ౩౦-౨౯ అశ్విని ౪ శుక్రః౧౪-౨౭. రక్రాం ౩౯ ప. కుక్రాం శక్రాం ౩౯ ఉ. పిం.పి. యజ్ఞః, యాగః. డొల్లు కర్తరీ. భో. ౧-౩౩. |

| ఇంగ్లీషు | అరవం | గ్రహ గతులు | శ్రీ విక్రమనామ సంవత్సర వైశాఖమాసః ఉత్తరాయణం<br>వసన్తఋతుః, శాలిశకాబ్దాః ౧౯౨౨ కల్యబ్దాః ౫౧౦౧ ఇంగ్లీష్ 2000 |
|---|---|---|---|
| 5 | ౨౩ | బుగు | శుక్ర. శుక్ల ప్రతిపత్ ౬-౧౬ ఉ.గం. 8-23 కృత్తిక ౩౬-౫ రా.గం. ౭ 19 సౌభా ౩-౩౪ కౌల ౫౩-౧౧ బవ ౬-౧౬ అహః ౩౧-౨౦ ఉ.వ. 8-55 ల 10-26 అమృ ౩౦-౨౩ భరణీ ౪ గురుః ౧౪-౩ భరణీ ౨ బుధః ౧౬-౩౨. చంద్రదర్శనం, సమశృంగం, సమార్ఘ, అనాధ్యాయః. శుక్రాం. శక్రాం ౩౬ ప. భో. ౧-౨౫. |
| 6 | ౨౪ | బుకు | శని. విదియ ౧-౬ ఉ.గం. 6-19 ఏష్యా ౫౪-౨౮ తె.గం. 4-6 రోహిణి ౩౨-౩౬ రా.గం. 6-55 అతి ౪౯-౩౦ కౌల ౧-౬ తైతుల ౨౮-౧౩ అహః ౩౧-౧౯ ప.వ. 11-28 ల 12-53, రా.వ. 12-10 ల 1-40 అమృ ౨౫-౪ భరణీ ౩ బుధః ౫౦-౩౫ భరణీ ౧ శుక్రః ౫౬-౩౫. శ్రీ పరశురామ జయన్తి. భో. ౧-౧౬. |
| 7 | ౨౫ | ర | ఆది. చవితి ౪౯-౨౬ రా.గం. 1-39 మృగశిర ౨౮-౩౯ ప్రా.గం. 5-20 సుకర్మ ౪౧-౫౩ వణి ౨౨-౨౯ అహః ౩౧-౨౧ రా.వ. 1-9 ల 2-38 అమృ ౮-౬ భరణీ ౪ రవిః ౩౧-౬. భో. ౧-౮. |
| 8 | ౨౬ | బు | సోమ. పంచమి ౪౩-౧౫ రా.గం. 11-10 ఆర్ద్ర ౨౪-౨౯ పా.గం. 3-39 ధృతి ౩౪-౮ బవ ౧౬-౨౧ అహః ౩౧-౨౩ రా.వ. 2-49 ల 4-19 అమృ ౧-౧౩ భరణీ ౪ బుధః ౨౫-౨౬. శ్రీ శంకర జయన్తి, శ్రీ భాష్యకారుల వారి శాత్తుమొర. భో. ౦-౫౯. |
| 9 | ౨౭ | కుబుకు | మంగళ. షష్ఠి ౩౭-౧౩ రా.గం. 8-44 పునర్వసు ౨౧-౨౦ ప.గం. 1-59 శూలం ౨౬-౩౨ కౌలవ ౧౦-౧౪ అహః ౩౧-౨౪ రా.వ. 9-28 ల 10-58 ప్రాగస్తమిత శుక్రః ౫౫-౧౭ అమృ ౧౪-౪౫ రోహిణీ ౧ కుజః ౧౫-౨౬ కృత్తికా ౧ బుధః ౫౫-౨౭ భరణీ ౨ శుక్రః ౩౮-౪౯ రాకాం ౨౦ ఈ. శ్రీ రామజయన్తి, మొదలియాండాన్ వర్ష తి.న. తిరుపతి గంగజాతర ప్రారంభం. శుక్రమౌఢ్య ప్రా. భో. ౦-౫౦. |
| 10 | ౨౮ | ర | బుధ. సప్తమి ౩౧-౨౮ రా.గం. 6-25 పుష్యమి ౧౬-౨౬ ప.గం. 12-25 గండం ౧౯-౭ గర ౪-౨౦ అహః ౩౧-౨౫ రా.వ. 12-28 ల 1-58 కృత్తికా ౧ రవిః ౫౮-౩౬ అమృ ౧-౨౪ రాకాం ౧౬ ప. తిరుపతి శ్రీ గో.రా.స్వామివారి బ్రహ్మోత్సవ అంకురార్పణం. భో. ౦-౪౧. |
| 11 | ౨౯ | బుశ | గురు. అష్టమి ౨౬-౧౦ పా.గం. 4-18 ఆశ్లేష ౧౩-౦ ప.గం. 11-0 వృద్ధి ౧౨-౨ బవ ౨౬-౧౦ అహః ౩౧-౨౭ రా.వ. 10-26 ల 11-58 అమృ ౯-౧౧ కృత్తికా ౨ వృషభే మి. బుధః ౨౬-౩౮ కృత్తికా ౧ శనిః ౩౩-౩౪ కృత్తికా కార్తె. విజకర్తరీ, తిరుపతి శ్రీ గో.రా.స్వామివారి బ్రహ్మోత్సవ ప్రారంభము, ధ్వజారోహణము. భో. ౦-౩౨. |
| 12 | ౩౦ | శు | శుక్ర. నవమి ౨౧-౩౫ ప.గం. 2-28 మఖ ౧౦-౬ ఉ.గం. 9-53 ధ్రువం ౫-౩౦ వ్యాఘా ౫౩-౫౮ కౌలవ ౨౧-౩౫ అహః ౩౧-౩౦ పా.వ. 5-36 ల 7-9 అమృ ౪-౨౩ పునరమృ ౫౨-౩౫ భరణీ ౩ శుక్రః ౨౧-౫౨ తిథి (౯+౧౦) ద్వయము. తిరుమలలో శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పరిణయం ప్రా. భో. ౦-౨౩. |
| 13 | ౩౧ | బు | శని. దశమి ౧౭-౪౭ ప.గం. 12-57 పుబ్బ ౮-౦ ఉ.గం. 9-02 హర్ష ౫౪-౧౧ గర ౧౭-౪౭ అహః ౩౧-౩౨ పా.వ. 4-6 ల 5-40 అమృ ౪౯-౧౫ కృత్తికా ౩ బుధః ౦-౧. ఏకాదశీ తిథిః. భో. ౦-౧౪. |
| 14 | ౧ | రకుబు | ఆది. ఏకాదశి ౧౫-౧ ప.గం. 11-50 ఉత్తర ౬-౫౪ ఉ.గం. 8-35 వజ్రం ౪౯-౫౨ భద్ర ౧౫-౧౧ అహః ౩౧-౩౫ పా.వ. 4-59 ల 6-35 కృత్తికా ౨ వృషభే మి. రవిః ౨౬-౨౩ అమృ ౫౨-౦ రోహిణీ ౨ కుజః ౪-౫౪ కృత్తికా ౪ బుధః ౩౧-౧౬. అష్టమిదినే వృషభ సం.ప్ర. హరిపద పుణ్యకాలం. ద్వాపరయుగాద్యః, సమార్ఘ. తిరుమలలో శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పరిణయం సమాప్తి. భో. ౦-౫. |
| 15 | ౨ | శు | సోమ. ద్వాదశి ౧౩-౨౦ ఉ.గం. 11-10 హస్త ౬-౫౪ ఉ.గం. 8-35 సిద్ధి ౪౬-౨౯ బాలువ ౧౩-౨౦ అహః ౩౧-౩౫ పా.వ. 4-45 ల 6-23 అమృ ౫౧-౪౬ భరణీ ౪ శుక్రః ౪-౫౨. తిరుపతి శ్రీ గో.రా. స్వామివారి గరుడోత్సవము, హృషీకేశ్, నారాయణవనం శ్రీ క.వేం. స్వామివార్ల బ్రహ్మోత్సవ అంకురార్పణం. వృషభ భోగ్యం ౫-౦. |
| 16 | ౩ | బు | మంగళ. త్రయోదశి ౧౨-౫౪ ఉ.గం. 10-58 చిత్ర ౮-౨ ఉ.గం. 9-08 వ్యతీ ౪౪-౧౯ తైతుల ౧౨-౫౪ అహః ౩౧-౩౬ ప.వ. 2-52 ల 4-32 అమృ ౪౭-౩౭ రోహిణీ ౧ బుధః ౫-౨౦ హృషీకేశ్, నారాయణవనం శ్రీ క.వేం. స్వామివార్ల బ్రహ్మోత్సవ ప్రా. ధ్వజారోహణం, తిరుపతి గంగజాతర సమాప్తి. భో. ౪-౫౦. |
| 17 | ౪ | రబుకు | బుధ. చతుర్దశి ౧౩-౪౩ ఉ.గం. 11-18 స్వాతి ౧౦-౩౧ ఉ.గం. 10-01 వరీ ౪౨-౫౪ వణి ౧౩-౪౩ అహః ౩౧-౩౭ పా.వ. 3-58 ల 5-40 అమృ ౨౫-౨౩ కృత్తికా ౩ రవిః ౫౪-౨౮ రోహిణీ ౨ బుధః ౪౦-౩౦ కృత్తికా ౧ శుక్రః ౪౭-౪౩. శ్రీ కూర్మ జయన్తి, శ్రీ నృసింహ జయన్తి. భో. ౪-౪౦. |
| 18 | ౫ | శు | గురు. ◯ పూర్ణిమ ౧౪-౪౯ ప.గం. 11-44 విశాఖ ౧౪-౧౨ ప.గం. 11-29 పరి ౪౨-౨౯ బవ ౧౪-౪౯ అహః ౩౧-౩౮ పా.వ. 3-49 ల 5-38 అమృ ౫౧-౦ రోహిణీ ౩ కుజః ౫౭-౪౭ అన్వాధానం. ప్రతిపత్తిథిః, శ్రీ అన్నమాచార్య జయన్తి, మహావైశాఖీ, తిరుపతి శ్రీ గో.రా. స్వామివారి రథోత్సవము. భో. ౪-౩౦. |

Month labels (vertical): మే 2000; చిత్తిరై ౨౭ (మేషమాసం); వైకాశి ౫ (వృషభమాసం)

| కు | రవంతు బుగుశ | | |
|---|---|---|---|
| | మూషాదిచక్రం | | రా |
| కే | | | |
| | | | |

వైకాసి ౩౧ (వృషభమాసః)

| | | | |
|---|---|---|---|
| 19 | ౬ | బుగు | శుక్ర. బ.ప్రతిపత్ ౧౯-౩ ప.గం. 1-25 అనూరాధ ౧౯-౦ ప.గం. 1-23 శివం ౪౩-౩ కౌలవ ౧౯-౦౩ అహః ౩౧-౩౯ రా.వ. 7-31 ల 9-16 అమృతాభావః, కృత్తికా ౧ గురుః ౨౦-౩౮ రోహిణీ ౩ బుధః ౧౮-౩ యోగః, ద్వితీయా తిథిః, అనధ్యాయః. తిరుపతి శ్రీ గో.రా. స్వామివారి బ్రహ్మోత్సవ అవభృథము, చక్రస్నానము, ధ్వజావరోహణము. భో.౪-౨౦. |
| 20 | ౭ | బుకు | శని. విదియ ౨౩-౧౪ ప.గం. 3-06 జ్యేష్ఠ ౨౪-౪౧ పా.గం. 3-40 సిద్ధం ౪౩-౩౬ గర ౨౩-౧౪ అహః ౩౧-౪౦ రా.వ. 12-30 ల 2-16 అమృ ౦-౩౫ రోహిణీ ౪ బుధః ౫౮-౧౫ కృత్తికా ౨ వృషభే ప్ర. శుక్రః ౩౦-౪, శూన్యతిథిః, హృషీకేశ్, నారాయణవనం శ్రీ క.వేం. స్వామివార్ల గరుడోత్సవము. భో. ౪-౧౦. |
| 21 | ౮ | రగు | ఆది. తదియ ౨౮-౨ పా.గం. 5-01 మూల ౩౧-౦ పా.గం. 6-12 సాధ్యం ౪౫-౪౮ భద్ర ౨౮-౨ అహః ౩౧-౪౧ పా.వ. 4-26 ల 6-12, తె.వ. 4-51 ల ప్రాగుదితో గురుః ౫౫-౧౦ అమృ ౧౩-౧౮ కృత్తికా ౪ రవిః ౨౩-౧౪. గురుమౌఢ్యత్యాగము. భో. ౪-౦. |
| 22 | ౯ | అయు బు | సోమ. చవితి ౩౩-౧౦ రా.గం. 7-04 పూ.షా. ౩౭-౩౬ రా.గం. 8-50 శుభం ౪౭-౩౪ బవ ౦-౩౬ అహః ౩౧-౪౨ ఉ.శే.వ. 6-37 వ. అమృ ౨౪-౧౭ మిథునాయనం ౨౫-౩౬ మృగ ౧ బుధః ౪౨-౨౪ కేక్రాం ౩౮ ఈ. భో. ౩-౫౧. |
| 23 | ౧౦ | కుకు | మంగళ. పంచమి ౩౮-౯ రా.గం. 9-04 ఉ.షా. ౪౪-౧౧ రా.గం. 11-24 శుక్లం ౪౯-౧ కౌలవ ౫-౩౯ అహః ౩౧-౪౪ తె.వ. 5-42 ల 7-28, అమృ ౨౬-౧౮ రోహిణీ ౪ కుజః ౧౩-౫౩ కృత్తికా ౩ శుక్రః ౧౩-౨ కేక్రాం ౪౪ ప. హృషీకేశ్, నారాయణవనం శ్రీ క.వేం. స్వామివార్ల రథోత్సవము. భో. ౩-౪౧. |
| మే 2000 24 | ౧౧ | రబు | బుధ. షష్ఠి ౪౨-౩౦ రా.గం. 10-47 శ్రవణం ౪౯-౫౧ రా.గం. 1-43 బ్రాహ్మం ౫౦-౧ గర ౧౦-౧౯ అహః ౩౧-౪౬ త్యాజ్యాభావః అమృ ౨౧-౧౯ రోహిణీ ౧ రవిః ౫౨-౭ మృగ ౨ బుధః ౩౦-౭. హృషీకేశ్, నారాయణవనం శ్రీ క.వేం. స్వామివార్ల బ్రహ్మోత్సవ అవభృథము, చక్రస్నానం, ధ్వజావరోహణము. భో. ౩-౩౧. |
| 25 | ౧౨ | కు | గురు. సప్తమి ౪౬-౪ రా.గం. 12-13 ధనిష్ఠ ౫౪-౫౪ రా.గం. 3-45 ఐంద్రం ౫౦-౨౨ విష్టి ౧౪-౧౭ అహః ౩౧-౪౮ ఉ.వ. 6-03 ల 7-47 అమృ ౨౬-౪౨ కృత్తికా ౪ శుక్రః ౫౬-౦. భో. ౩-౨౨. |
| 26 | ౧౩ | బు | శుక్ర. అష్టమి ౪౮-౨౨ రా.గం. 1-08 శతభిషం ౫౮-౪౦ తె.గం. 5-15 వైధృతి ౪౯-౪౧ బాలవ ౧౭-౧౩ అహః ౩౧-౪౭ ప.వ. 11-24 ల 1-6 అమృ ౩౯-౩౨ మృగ ౩ మిథునే ప్ర. బుధః ౨౩-౪౫. భో. ౩-౧౨. |
| 27 | ౧౪ | | శని. నవమి ౪౯-౩౭ రా.గం. 1-38 పూ.భా. ౬౦-౦ పూర్తి. విష్కం ౪౮-౧౩ తైతుల ౧౯-౦ అహః ౩౧-౪౭ ప.వ. 11-54 ల 1-34 అమృ ౪౦-౧౪. భో. ౩-౦౨. |
| 28 | ౧౫ | రకుబు కురాకే | ఆది. దశమి ౫౦-౦ రా.గం. 1-47 పూ.భా. ౧-౨ ఉ.గం. 6-12 ప్రీతి ౪౫-౨౯ వణి ౧౯-౪౭ అహః ౩౧-౪౮ పా.వ. 4-01 ల 5-39 అమృ ౫౦-౪ రోహిణీ ౨ రవిః ౨౧-౧౪ మృగ ౧ కుజః ౩౭-౧౯ మృగ ౪ బుధః ౨౪-౧ రోహిణీ ౧ శుక్రః ౩౮-౧౧ పున ౪ రాహుః ఉ.షా. ౨ కేతుః ౪౦-౦. శ్రీ హనుమజ్జయన్తి, కర్తరీ త్యాగం. భో. ౨-౫౩. |
| 29 | ౧౬ | | సోమ. ఏకాదశి ౪౭-౫౫ రా.గం. 12-57 ఉ.భా. ౨-౨౦ ఉ.గం. 6-43 ఆయు ౪౧-౫౮ బవ ౧౮-౫౮ అహః ౩౧-౪౯ రా.వ. 6-45 ల 8-21 అమృ ౫౬-౨౮. సర్వేషాం ఏకాదశీ, మహీజయన్తి. భో. ౨-౪౩. |
| 30 | ౧౭ | బు | మంగళ. ద్వాదశి ౪౫-౧౩ రా.గం. 11-52 రేవతి ౨-౨౯ ఉ.గం. 6-46 సౌభా ౩౭-౧౭ కౌలవ ౧౬-౩౪ అహః ౩౧-౫౦ రా.వ. 2-26 ల 4-0 అమృ ౪౩-౪౮ ఆర్ద్రా ౧ బుధః ౩౦- ౩౪. భో. ౨-౩౩. |
| 31 | ౧౮ | రకు | బుధ. త్రయోదశి ౪౧-౩౮ రా.గం. 10-26 అశ్విని ౧:-౨౯ ఉ.గం. 6-22 భరణి ౫౮-౫ తె.గం. 5-36 శోభ ౩౨-౦ గర ౧౩-౨౬ అహః ౩౧-౫౧ పా.వ. 3-40 ల 5-13 అమృ ౪౭-౫౭ రోహిణీ ౩. రవిః ౫౧-౦ రోహిణీ ౨ శుక్రః ౨౧-౧౩ ప్రదోషః. భో. ౨-౨౩. |
| 1 | ౧౯ | బు | గురు. చతుర్దశి ౩౭-౩ రా.గం. 8-36 కృత్తిక ౫౬-౪౮ తె.గం. 4-30 అతి ౨౫-౪౯ భద్ర ౯-౨౦ అహః ౩౧-౫౨ పా.వ. 5-03 ల 6-35 అమృ ౫౧-౫ ఆర్ద్రా ౨ బుధః ౪౮-౪౪. రక్రాం ౫౭ ఈ. శుక్రాం ౧ ఈ. ౫౮ ప. మాసశివరాత్రిః. భో. ౨-౧౪. |
| జూన్ 2000 2 | ౨౦ | కుగు | శుక్ర. ● అమావాస్య ౩౧-౫౩ రా.గం. 6-32 రోహిణీ ౫౩-౨౫ తె.గం. 3-8 సుకర్మ ౧౯-౯ చతు ౪-౨౮ అహః ౩౧-౫౩ రా.వ. 7-36 ల 9-06 మృగ ౨ కుజః ౨౮-౩౨ కృత్తికా ౨ వృషభే ప.గురుః ౩౩-౩౧ రక్రాం ౫౩ ప. కుక్రాం ౫౩ ఈ. సర్వ అమావాస్యా, అన్వాధానం పిం. పి. యజ్ఞః. భృగుమహర్షి వర్ష తి.న. శ్రీనివాసదీక్షితర్ వర్ష తిన. నర్మదా నదీ పుష్కరారంభః. భో. ౨-౪. |

| ఇంగ్లీషు | అరవం | గ్రహ గతులు | శ్రీ విక్రమనామ సంవత్సర జ్యేష్ఠమాసః ఉత్తరాయణం<br>గ్రీష్మ ఋతుః, శాలిశకాబ్దాః ౧౯౨౨ కల్యబ్దాః ౫౧౦౧ ఇంగ్లీష్ 2000 |
|---|---|---|---|
| 3 | ౨౧ | శు | శని. శుక్ల ప్రతిపత్ ౨౬-౯ సా.గం. 4-14 మృగశిర ౪౯-౨౬ రా.గం. 1-33 ధృతి ౧౨-౦ బవ ౨౬-౯ అహః ౩౧-౫౪ ఉ.వ. 8-21 ల 9-51 అమృ ౨౮-౪౭ రోహిణీ ౩ శుక్రః ౪-౧౧ యోగః. చంద్రదర్శనం, ఉత్తరశృంగం, సమార్ఘ్యం, శుక్రాం ౪౯ ప. బుద్ధ జయన్తి. భో. ౧-౫౪. |
| 4 | ౨౨ | రబు | ఆది. విదియ ౨౦-౭ ప.గం. 1-49 ఆర్ద్రా ౪౫-౧౮ రా.గం. 11-54 శూలం ౪-౩౨ గండం ౫౨-౨౯. కౌలవ ౨౦-౭ అహః ౩౧-౫౫ ఉ.వ. 9-22 ల 10-51 అమృ ౨౨-౧౧ రోహిణీ ౪ రవిః ౨౧-౪ ఆర్ద్రా ౩ బుధః ౧౯-౧౯ తిథి (౨+౩) ద్వయము, రాక్రాం ౪౫ ఘ. భో. ౧-౪౫. |
| 5 | ౨౩ | శు | సోమ. తదియ ౧౪-౦ ఉ.గం. 11-22 పునర్వసు ౪౧-౮ రా.గం. 10-14 వృద్ధి ౪౯-౧౧ గర ౧౪-౦ అహః ౩౧-౫౫ వ.వ. 11-4 ల 12-33, తె.వ. 5-42 ల. అమృ ౩౫-౩౩ రోహిణీ ౪ శుక్రః ౪౭-౦. చతుర్థీ తిథిః, రాక్రాం ౪౧ ప. శ్రీ నమ్మాళ్వారుల ఉత్సవారంభం. భో. ౧-౩౫. |
| 6 | ౨౪ | శ | మంగళ. చవితి ౭-౫౦ ఉ.గం. 8-55 పుష్యమి ౩౭-౬ రా.గం. 8-37 ధ్రువం ౪౧-౪౨ భద్ర ౭-౫౦ అహః ౩౧-౫౬ ఉ.తే.వ. 7-12 వ. అమృ ౨౨-౧౨ కృత్తికా ౨ వృషభే మి. శనిః ౫౦-౩౯. భో. ౧-౨౫. |
| 7 | (వృషభమాసః) ౨౫ | రకుబు | బుధ. పంచమి ౨-౨ ఉ.గం. 6-36 ఏష్యా ౫౪-౨౭ తె.గం. 3-15 ఆశ్లేష ౩౩-౩౧ రా.గం. 7-11 వ్యాఘా ౩౪-౩౭ బాలవ ౨-౨ కౌలవ ౨౭-౧౪ అహః ౩౧-౫౭ ఉ.వ. 8-39 ల 10-9 అమృ ౨౯-౪౫ మృగ ౧ రవిః ౫౧-౦ మృగ ౩ మిధునే శ. కుజః ౨౪-౧౧ ఆర్ద్రా ౪ బుధః ౮-౩౨. భో. ౧-౧౬. |
| 8 | వైకాశి ౨౬ | శు | గురు. సప్తమి ౫౧-౪౪ రా.గం. 2-28 మఘ ౩౦-౨౯ సా.గం. 5-58 హర్ష ౨౮-౦ గర ౨౪-౭ అహః ౩౧-౫౮ ఉ.వ. 6-35 ల 8-06, రా.వ. 1-41 ల 3-13 అమృ ౨౪-౫౧ మృగ ౧ శుక్రః ౨౯-౨౨. భో. ౧-౬. |
| 9 | ౨౭ | | శుక్ర. అష్టమి ౪౭-౫౫ రా.గం. 12-57 పుబ్బ ౨౮-౨౦ సా.గం. 5-05 వజ్రం ౨౨-౦ విష్టి ౧౯-౫౦ అహః ౩౧-౫౯ రా.వ. 12-8 ల 1-40 అమృ ౧౨-౫౧. భో. ౦-౫౬. |
| 10 | ౨౮ | బు | శని. నవమి ౪౫-౦ రా.గం. 11-46 ఉత్తర ౨౬-౫౩ సా.గం. 4-32 సిద్ధి ౧౬-౪౧ బాలవ ౧౬-౨౭ అహః ౩౨-౦ రా.వ. 12-54 ల 2-30 అమృ ౯-౨౨ పున ౧ బుధః ౨౬-౨౮. భో. ౦-౪౭. |
| 11 | ౨౯ | రశు | ఆది. దశమి ౪౩-౧౫ రా.గం. 11-6 హస్త ౨౬-౩౬ సా.గం. 4-26 వ్యతీ ౧౨-౧౭ తైతుల ౧౪-౮ అహః ౩౨-౦ రా.వ. 12-34 ల 2-11 అమృ ౧౧-౪౨ మృగ ౨ రవిః ౨౧-౨౦ మృగ ౨ శుక్రః ౧౨-౨౦. మెయిన్ వరదరాజస్వామివారి వర్ష తి.న. అప్పలాయిగుంట శ్రీ ప్ర.వేం. స్వామివారి బ్రహ్మోత్సవ అంకురార్పణం. భో. ౦-౩౭. |
| 12 | ౩౦ | కు | సోమ. ఏకాదశి ౪౨-౩౭ రా.గం. 10-50 చిత్త ౨౭-౩౦ సా.గం. 4-47 వరీ ౮-౪౫ వణి ౧౨-౫౭ అహః ౩౨-౧ రా.వ. 10-35 ల 12-15 అమృ ౧౧-౨౦ మృగ ౪ కుజః ౨౦-౧౮. అప్పలాయిగుంట శ్రీ ప్ర.వేం. స్వామివారి బ్రహ్మోత్సవ ప్రా॥ ధ్వజారోహణము, తిరుచానూరు శ్రీ పద్మావతీ ~~తాయార్ల తెప్పోత్సవ ప్రా॥~~ భో. ౦-౨౭. |
| 13 | ౩౧ | శు | మంగళ. ద్వాదశి ౪౩-౨౪ రా.గం. 11-9 స్వాతి ౨౯-౪౧ సా.గం. 5-40 పరి ౬-౧౩ బవ ౧౩-౦ అహః ౩౨-౧ రా.వ. 11-35 ల 1-16 అమృ ౭-౦ మృగ ౩ మిధునే మి. శుక్రః ౫౫-౧౯. తిరుమలనంబి వర్ష తి.న. భో. ౦-౧౮. |
| 14 | ౩౨ | రబు | బుధ. త్రయోదశి ౪౫-౧౬ రా.గం. 11-54 విశాఖ ౩౩-౩ రా.గం. 7-01 శివం ౪-౪౬ కౌలవ ౧౪-౨౦ అహః ౩౨-౨ రా.వ. 11-19 ల 1-02 అమృ ౯-౪౯ మృగ ౩ మిధునే మి. రవిః ౫౧-౫౧ పున ౨ బుధః ౪౪-౧౬. అస్మిన్దినే మిధున సం. ప్ర. షడశీతి పుణ్యకాలః, కూన్యార్ఘ్యః, ప్రదోషః, శ్రీ నమ్మాళ్వార్ల శాత్తుమొర, తిరుమల శ్రీవారి జ్యేష్ఠాభిషేకం ప్రారంభం. భో. ౦-౮. |
| 15 | ౧ | | గురు. చతుర్దశి ౪౮-౧౮ రా.గం. 1-07 అనూరాధ ౩౭-౩౧ రా.గం. 8-48 సిద్ధం ౪-౧౪ గర ౧౬-౪౭ అహః ౩౨-౩ రా.వ. 2-55 ల 4-40 అమృ ౯-౩౫ మిధున మాసారంభః. మిధునభోగ్యం. ౫-౨౮. |
| 16 | ఆని ౨ | శు | శుక్ర. ◯ పూర్ణిమ ౫౨-౨౫ రా.గం. 2-46 జ్యేష్ఠ ౪౩-౩ రా.గం. 11-01 సాధ్యం ౪-౩౨ విష్టి ౨౦-౨౧ అహః ౩౨-౩ త్యాజ్యాభావః, అమృ ౧౯-౧౧ మృగ ౪ శుక్రః ౩౮-౧౧ అన్వాధానం. తిరుచానూరు శ్రీ పద్మావతీ తాయార్ల తెప్పోత్సవ సమాప్తి. అప్పలాయిగుంట శ్రీ ప్ర.వేం. స్వామివారి గరుడోత్సవము, తిరుమల శ్రీవారి జ్యేష్ఠాభిషేకం సమాప్తి. భో. ౫-౧౮. |

జూన్ 2000

| | శ | రవంగు కుకు | బు |
|---|---|---|---|
| | మాసాదిచక్రం | | రా |
| కే | | | |
| | | | |

మార్చి 2000 — (ఫాల్గుణమాసః)

| తేదీ | | | |
|---|---|---|---|
| 17 | ౩ | కుగు | శని. బ. ప్రతిపత్ ౫౭-౧౦ తె.గం. 4-37 మూల ౪౯-౧౨ రా.గం. 1-29 శుభం ౫-౩౬ బాలవ ౨౪-౪౭ అహః ౩౨-౩ ఉ.వ. 7-51 ల 9-37, రా.వ. 11-43 ల 1-29 అమృ ౩౧-౩౩ ఆర్ద్రా ౧ కుజః ౧౭-౧౪ కృత్తికా ౩ గురుః ౧౬-౨౩ యోగః. ఛో. ౫-౭. |
| 18 | ౪ | ర | ఆది. విదియ ౬౦-౦ పూర్తి. పూ.షా. ౫౫-౪౯ తె.గం. 4-9 శుక్లం ౭-౫ తైతుల ౨౯-౪౩ అహః ౩౨-౩ ప.వ. 12-10 ల 1-56 అమృ ౪౨-౩౦ మృగ ౪ రవిః ౨౨-౩౧ కేక్రాం ౫౬ ఘ. ఛో. ౪-౫౭. |
| 19 | ౫ | శు | సోమ. విదియ ౨-౧౭ ఉ.గం. 6-44 ఉ.షా. ౬౦-౦ పూర్తి. బ్రాహ్మం ౮-౪౭ గర ౨-౧౭ అహః ౩౨-౩ ప.వ. 1-01 ల 2-47 అమృ ౪౪-౩౫ ఆర్ద్రా ౧ శుక్రః ౨౦-౩౭ కేక్రాం. అప్పలాయిగుంట శ్రీ ప్ర.వేం. స్వామివార్ల రథోత్సవము. ఛో. ౪-౪౭. |
| 20 | ౬ | | మంగళ. తదియ ౭-౧౩ ఉ.గం. 8-42 ఉ.షా. ౨-౧౮ ఉ.గం. 6-44 ఐంద్రం ౧౦-౨౨ భద్ర ౭-౧౩ అహః ౩౨-౨ ప.వ. 11-8 ల 12-50 అమృ ౩౯-౩౭ కేక్రాం ౨ ప. అప్పలాయిగుంట శ్రీ ప్ర.వేం. స్వామివార్ల బ్రహ్మోత్సవ అవభృథము, చక్రస్నానము, ధ్వజావరోహణము. ఛో. ౪-౩౬. |
| 21 | ౭ | ర | బుధ. చవితి ౧౧-౩౩ ఉ.గం. 10-26 శ్రవణం ౮-౧౩ ఉ.గం. 9-6 వైధృతి ౧౧-౨౮ బాలవ ౧౧-౩౩ అహః ౩౨-౨ ప.వ. 1-27 ల 3-11 అమృ ౪౫-౭ ఆర్ద్రా ౧ రవిః ౫౩-౧౫. ఛో. ౪-౨౬. |
| 22 | ౮ | అయ కుశు | గురు. పంచమి ౧౫-౦ ప.గం. 11-49 ధనిష్ఠ ౧౩-౨౦ ఉ.గం. 11-9 విష్కం ౧౧-౫౪ తైతుల ౧౫-౦ అహః ౩౨-౨ రా.వ. 6-50 ల 8-36 అమృ ౫౮-౧౧ కర్కాటకాయనం ౫౬-౪ ఆర్ద్రా ౨ కుజః ౧౭-౧౨ ఆర్ద్రా ౨ శుక్రః ౩-౧౫. ఛో. ౪-౧౫. |
| 23 | ౯ | బు | శుక్ర. షష్ఠి ౧౭-౨౩ ప.గం. 12-46 శతభిషం ౧౭-౨౫ ప.గం. 12-47 ప్రీతి ౧౧-౩౦ వణి ౧౭-౨౩ అహః ౩౨-౨ రా.వ. 7-30 ల 9-10 అమృ ౫౯-౧౨ బుధవక్రారంభః ౨౫-౧౮ వక్రారంభకాలే బుధః ౨-౨౬-౬-౩౦. తిరుచానూరు శ్రీ సుందరరాజ స్వామివారి అవతారోత్సవ ప్రా॥ ఛో.౪-౫. |
| 24 | ౧౦ | శు | శని. సప్తమి ౧౮-౩౨ ప.గం. 1-14 పూ.భా. ౨౦-౧౫ ప.గం. 1-55 ఆయు ౧౦-౯ బవ ౧౮-౩౨ అహః ౩౨-౨ రా.వ. 11-47 ల 1-25 అమృతాభావః, ఆర్ద్రా ౩ శుక్రః ౪౬-౧౪ అష్టమీ తిథిః, ఉభయానధ్యాయః. ఛో. ౩-౫౪. |
| 25 | ౧౧ | ర | ఆది. అష్టమి ౧౮-౨౩ ప.గం. 1-11 ఉ.భా. ౨౧-౫౨ ప.గం. 2-35 సౌభా ౭-౪౫ కౌలవ ౧౮-౨౩ అహః ౩౨-౧ రా.వ. 2-39 ల 4-15 అమృ ౯-౩౩ ఆర్ద్రా ౨ రవిః ౨౪-౧౦ నవమీ తిథిః, తిరుచానూరు శ్రీ సుందరరాజ స్వామివారి అవతారోత్సవ సమాప్తి. ఛో. ౩-౪౩. |
| 26 | ౧౨ | | సోమ. నవమి ౧౭-౦ ప.గం. 12-38 రేవతి ౨౨-౧౩ ప.గం. 2-43 శోభ ౪-౨౪ గర ౧౭-౦ అహః ౩౨-౦౧ త్యాజ్యాభావః, అమృ ౨౬-౧౧ దశమీ తిథిః. ఛో. ౩-౩౨. |
| 27 | ౧౩ | కుశు | మంగళ. దశమి ౧౪-౨౫ ప.గం. 11-37 అశ్విని ౨౧-౨౫ ప.గం. 2-26 అతి ౦-౪ సుకర్మ ౫౫-౩ భద్ర ౧౪-౨౫ అహః ౩౨-౦ ఉ.వ. 10-29 ల 12-04 రా.వ. 11-45 ల 1-18 అమృ ౩-౪౩ ఆర్ద్రా ౩ కుజః ౧౫-౪౦ ఆర్ద్రా ౪ శుక్రః ౨౯-౧౦. ఛో. ౩-౨౨. |
| 28 | ౧౪ | ర | బుధ. ఏకాదశి ౧౦-౫౦ ఉ.గం. 10-11 భరణి ౧౯-౪౦ ప.గం. 1-43 ధృతి ౪౯-౩ బాలవ ౧౦-౫౦ అహః ౩౨-౦ రా.వ. 1-12 ల 2-44 అమృ ౮-౪ ఆర్ద్రా ౩ రవిః ౫౫-౨౨ శుక్రాం ౨౦ ఘ. మతత్రయ ఏకాదశి. ఛో. ౩-౧౧. |
| 29 | ౧౫ | | గురు. ద్వాదశి ౬-౨౫ ఉ.గం. 8-25 కృత్తిక ౧౭-౫ ప.గం. 12-41 శూలం ౪౨-౨౭ తైతులం ౬-౨౫ అహః ౩౧-౫౯ తె.వ. 3-48 ల 5-19 అమృ ౧౧-౨౧ శుక్రాం ౧౭ ప. ఛో. ౩-౦౧. |
| 30 | ౧౬ | శు | శుక్ర. త్రయోదశి ౧-౨౦ ఉ.గం. 6-23 ఏష్యా ౫౪-౧౬ తె.గం. 4-05 రోహిణి ౧౩-౪౯ ప.గం. 11-22 గండం ౩౫-౨౦ వణి ౧-౨౦ విష్టి ౨౭-౮ అహః ౩౧-౫౯, పా.వ. 4-37 ల 6-07 అమృ ౬-౧౫ పునర్వసు ౪౯-౨౫ పున ౧ శుక్రః ౧౧-౨౮. మాసశివరాత్రిః. ఛో. ౨-౫౦. |
| ఏప్రి 1 | ౧౭ | | శని. ● అమావాస్య ౪౯-౩౩ రా.గం. 1-40 మృగశిర ౧౦-౦౧ ఉ.గం. 9-51 వృద్ధి ౨౭-౫౩ చతు ౨౨-౩౪ అహః ౩౧-౫౯ ప్రా.వ. 5-41 ల 7-11 అమృ ౪౨-౩౭ సర్వ అమావాస్య, పిం.పి. యజ్ఞః, అన్వాధానం, రక్రాం కుక్రాం ౧౦ ఘ. శ్రీ పెరియాళ్వార్ల ఉత్సవారంభము. ఛో. ౨-౪౦. |

